అరుణా పబ్లిషింగ్ హౌస్ తరపున-

1 వ ముద్రణ : 1993 ఫిబ్రవరి
2 వ " : 2002 ఏప్రియల్



రచనా కాలం : **1936**

**ధర : 22-00**

డి.టి.పి :
కల్పనా గ్రాఫిక్స్
దుర్గాఅగ్రహారం, విజయవాడ-2. ఫోన్ : 434138

ముద్రణ :
స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ-3. ఫోన్ : 578211



# ఇందులో...



# మోసం చేసిందా ?

హనుమంతరావు జాడ్యం ప్రణయతత్వమూ, ప్రబంధ పారాయణా, విరహవర్ణనలూ, ప్రేయసీస్మరణలలో ప్రారంభమై, చప్పున వారంరోజుల కింద వేదాంతచర్చా, విరక్తి ఉపన్యాసాలూ, సీతారామాంజనేయపఠనమూ, స్త్రీ ద్వేషములోకీ దిగింది. భర్తృహరి శృంగార శతకం ఆఖరు పేజీతిప్పి, వైరాగ్య శతకం ప్రారంభించి నట్లయింది. వాడి వాగుడంతా వినేగతి పట్టిన నేను, పది పదిహేనురోజులు శాంతంగా భరించి, చికిత్సలు ప్రయత్నించాను కాని యీ జాడ్యపు అసలు కారణం కనిపెడతేగాని స్వస్థత కలగదని, అతను ఆ జాడ్యంలోనూ, అంతకుముందూ చేస్తున్న ప్రదక్షిణాల వల్ల కారణం విష్ణాలయం ప్రాకార సామీప్యంలో వుండాలనుకుని వెతికాను. అతనిని వొదిలిన శృంగార జాడ్యం అక్కడ నన్నావరించింది.

ఈ శరీరం అనహ్యావు మాంనమునిన్నీ, దీన్ని జాగ్రత్తగా అలంకరించడమంత పరిహాస్పదమైనపని లేదనీ, యెన్నడో కట్టెలలో కాల్చేదేననీ పాడుతున్న హనుమంతరావు ఉత్సాహ వాక్యాలను వీలైనంతవరకు పెడచెవినిబెట్టి షోకుచేసుకుని, విష్ణాలయంవేపు వెళ్ళాను. సంజ మసకల్లో తెల్ల గన్నేరు మొక్కలకిందికి లలిత వొచ్చింది. నాలుగురోజుల్లో యెవరితోనూ నాకింత స్నేహంకాలేదు. మొదటిరోజునే నాతో-

"నన్నొక్క సందేహం బాధిస్తోంది. మీరు మీ జ్ఞానవిశేషంవల్లా, విద్యాధిక్యతవల్లా తీర్చగలరని నా ఆశ. మీ కీర్తి మీ పుస్తలకాలవల్లా, కొందరు స్నేమితులవల్లా విన్నాను" అంది.

ఆ స్నేహితులలో ఒకడు హనుమంతరావు కాడుగదా! అని సందేహం కలిగి, "అతన్నెరుగుదువా" అని అడిగాను లలితను. చాలా నాజూకుగా తలవంచుకొని, "నాకు బాగా తెలీదు. నా అక్కయ్య నెరుగునాయన" అంది. నా గుండె నిబ్బరపడి, రాత్రికి వాడిగొంతు పిసకడమా? కత్తితో నరకడమా? ఏది సులభమనే ఆలోచనను ఆపుకున్నాను. ముసలి భర్తను వొదిలిరావడమా? ఏమిటీమె సందేహమని ఆలోచించాను. కాని ఆమె నా దగ్గిర్నించి సందేహం తీర్చుకునే పద్ధతి చాలా మనోహరంగా వుండడంవల్ల దాన్ని తీర్చడానికి నేనేమీ తొందరపళ్ళేదు. దేవాలయ పుణ్యక్షేత్రంలో, లక్ష్మీదేవి సాన్నిధ్యమందు, తెల్లగన్నేరు వాసనలతో నానిన నూనె ప్రమిదలూ వాడిన తులసీదళాలు కలిసి పంపే సుగంధంలో లేతరాత్రి చిన్ని చీకట్లలో దొరికన ఈ శృంగారం నాకెంతో వుల్లాసాన్నీ మాధుర్యాన్నీ యిచ్చింది. ఈ స్నేహానికి పర్యవసానమేమిటి? ఈమె యెవరు? ఎందుకిట్లా వొస్తుందని యోచిస్తే ఆ కల యెక్కడ మాయమౌతుందో నని భయంతో ఆనందంతో కళ్ళుమూసుకుని మునిగిపోయినాను. హనుమంతరావు వేదాంత శ్రవణం ప్రారంభించగానే గదిలోనించి పరిగెత్తేవాణ్ణి. ఆరు రోజులయింది. లలిత పరిచయం పెదిమల దగ్గిరే ఆగింది. ఎందుకు? ఆటంకమేమిటో తెలీదు.

"లలితా! నిన్ను వొదిలి వెళ్ళినా రోజల్లా నువ్వే తలుపుకువస్తావు. స్కూల్లోవున్న తటాలున నీరూపం జ్ఞాపక మొచ్చి పిచ్చెక్కుతుంది. నీ ముఖంపోలిక పుస్తకంలో గీస్తోవుంటే మా లెక్చరర్ చూశాడు. నా హృదయాన్ని లాగేసి, ఈ చెరుగులో దాచేసుకున్నావు, నీ హృదయానికి దగ్గిరగా! నావల్ల నేరమేమిటో చెప్పు ఎందుకట్లా కళ్ళు కిందికివాల్చి, జవాబు చెప్పక హృదయంలో యేదో రహస్యమైన బాధ వున్నట్లు తోపిస్తావు? నేను నీవాణ్ణే. నన్నిట్లా తోసేస్తా వెందుకు?"

నిదానంగా వాల్చివున్న ఆ ముఖంవంక చూశాను. ముక్కుదగ్గిర నించీ చంపలమీద పొడుగ్గా కణతలవరకు పరుచుకునివున్న కనువెంట్రుకలని



చేత్తోతాకి చెంపమీద మెల్లిగా కొట్టాను.

"నా సందేహమే అది. మిమ్మల్ని ఆ రోజునే అడగాలనుకున్నాను. చూడండి. పాపం కదండీ పెళ్ళి కానివాళ్ళతో సహవాసం? పోనీ, యిట్లా కూచుంటే తప్పేముంది కాని....అసలు భార్యగా వుండడం పాపంకదూ! ఈ కాస్త సుఖానికి వెయ్యేళ్ళు నరకంలో అగ్నిగుండంలో కాలడం!"

ఇంతేనా యీ సందేహం అనుకున్నాను. కాని లలిత మనసులో ఈ వూహ బాదిస్తున్నట్టూ; ఈ ఆలోచనే ఆమెని ఆటంకపరుస్తున్నట్లూ తట్టింది. కాని ఇంత గాఢంగా ఆలోచించడానికి వ్యవధాన మెక్కడిది? వయసులోవున్న పిల్ల తన వాంఛనీ, ధర్మాన్నీ విడదీసి యోచించ కలిగినంత అవసరమెట్లా కలిగిందని ఆశ్చర్యం వేసింది. నేనూ ఆలోచించ తలుచుకోలేదు. "లలితా! నన్నడగడం మంచిదయింది. ఈ విషయమై నేను దీర్ఘంగా ఆలోచించాను. నాకంటె ఎవరికీ ఎక్కువతెలీదు. ఇంకెవరి నన్నా అడిగితే నీకు తప్పు అభిప్రాయాలు చెప్పి వుందురు."

నోరు సన్నగా చంద్రవంకలాగుచేసి చిరునవ్వుతో, వోరకంటితో నావంక చూస్తో - "మీ పుస్తకాలు చదివాను. అంతమాత్రం మీ అపారజ్ఞానము, ఉత్తమ మేధాశక్తి కనిపెట్టలేక పోయినా నంటారా? తరవాత మిమ్మల్ని దారుసార్లు చూసి, మీ పుస్తకంలో మీ 'ఫోటో' నించి పోల్చుకున్నాను."

నేను దేవేంద్ర సింహాసనా న్నధిష్టించి త్రైలోకాధిపత్యం వెంటనే వహించాను. ఒక్క స్త్రీ హృదయంలో ఇంత వున్నత భక్తినీ, ప్రేమను వెలిగించిన నా కవిత్వం, నా వంశం, నా జన్మం, నా పద్యాలు అచ్చు వెయ్యమని 'భారతి' ని బతిమాలుకుంటో నేను రాశిన వుత్తరాలు అన్నీ విఫలమైనాయి.

"నీ మెత్తని మనసుల్లో ఇట్లాంటి దుర్మార్గపుటూహలు యేరాక్షసులు కల్పించారు."

"చిన్నప్పణ్ణించి మా యింటో పురాణాలు విన్నాను. అప్పణ్ణించి నాకీ భయం పట్టుకుంది. మీ పుస్తకాలు చదివి యెంత ప్రయత్నించినా మనసు కుదటపళ్ళేదు."

"స్త్రీ పురుషవాంఛ సహజం. మృగాల్లో పుణ్య పాపాలున్నాయా? మనుష్యుల్లో పాపమని యెవరన్నారు? దేవుడొచ్చి చెప్పాడా? పుస్తకాల్లో రాశారు. ఎవరు? సంఘక్షేమం కోపమని కొందరు మహానుభావులివి యేర్పరచి, పాపాలని పేరు పెట్టి మూఢుల్ని దడిపించారు. ప్రతివారూ లేచిపోయి సంఘం గోల అయిపోతుందేమోనని యిట్లాంటి నిబంధన లేర్పరిచి, నరకమనే భయంతో మనుష్యుల స్వభావసిద్ధమైన వాంఛల్ని కట్టి వెయ్యాలని ప్రయత్నించారు."

"మరి యముడూ, చిత్రగుప్తుడూ వీళ్ళందరూనో?"

"యోచించు. ఆ చిత్రగుప్తుడు నోటు పుస్తకము పట్టుకుని, ఇన్ని కోట్ల ప్రజల గదుల్లోనూ దూరి 'యెలక్ట్రిక్ టార్చి' వెలిగించి, ప్రతి జతకీ పెళ్ళి జరిగిందోలేదో సాక్ష్యాలు విచారించుకుంటో తిరుగుతాడా!"

"నిజం చెపుదురూ!"

"నిజమే"

"అయితే యింక నీతీ దేవుడూ యేమీలేవూ"

"లేకేం? నీతంటే యేమిటి? అంతా మన మేర్పరచుకున్నదే! దేవుడున్నాడు. కాని యీ నీతులన్నీ యేర్పరచింది దేవుడుకాదు...."

ఈ ప్రకారం అరగంట మాట్లాడాను. ప్రతి వాక్యం గురు బోధవలె భక్తితో విని వెళ్ళేటప్పుడు నా విద్వత్తును ఒక ముద్దుతో సత్కరించింది.

మర్నాడు నా పుస్తకాలమీద "నా హృదయేశ్వరికి" అని రాసి, ఆమెకి సమర్పించాను. ఆ సాయంత్రమంతా హిందూ మతంమీదా, ముక్కోటి దేవతలమీదా, త్రిమూర్తులమీదా ఉపన్యాసమిచ్చి, దేవుడు వొక్కడే అనిన్నీ, యీ ప్రపంచం చాలా విశాలమయిందనిన్నీ, క్షుద్రులమైన మన చిన్న కార్యాల నీతీ అవినీతులు కనిపెట్టడంకన్న యీశ్వరుడికి చాలా పనులున్నాయనీ రూఢిపరిచాను.



నీతనగా మనసులో ప్రేమించిన వాడికి సర్వమూ అర్పించటమేనని బోధించాను. ఆ మాటలకోసమే తనెదురు చూస్తున్నట్లు అతిశ్రద్ధతో వింది.

"పోనీ, యీ పనులకి అంత ప్రాముఖ్యం లేనప్పుడు అనేక మందికి-యిద్దరు ముగ్గురికి-సంతోషమిస్తే నేమండి ?"

నా హృదయం భగ్గుమంది. "అట్లాకూడదు. ఎవరిని ప్రేమించావో వారిని తప్ప యితర్లని తాకడం మహాపాపం."

"పాపం లేదన్నారు."

"అదే, ఆ నరకం పాపం కాదు-మన అంతరాత్మలకి...."

"అంటే అంతరాత్మలకైనా, పాపమూ పుణ్యమూ వున్నాయన్న మాట."

చర్చ చాలా యిబ్బందిగా దిగింది. చీకటయింది. ఇంకా యెన్నాళ్ళు? ఈ సౌందర్యం నాపక్కన కూచుని నన్ను దూరాన్నుంచి యేడిపిస్తోంది. ఇంటికి వెడితే ఇట్లా మాట్లాడి, అట్లాచేసి, లోపరుచుకోక మూర్ఖుణ్ణయి కాలమంతా యెందుకు వ్యర్థం చేశానా అని బాధపడి, ఎంతో నిశ్చయపరుచుకుని యెంత ప్రయత్నించినా నన్ను చమత్కారంగా తప్పించుకుంటోంది.

"అదంతా రేపు ఆలోచిద్దాములే, నీమీద ప్రేమతో కాలిపోతోవుంటే, నన్నెందు కింత నిర్దయగా.........."

"ఉండండి. మరి ముందు నేచెప్పే మాట వినండి. నిన్నణ్ణించి నా మనసులో మీ మాటలే ఆలోచిస్తున్నాను. మీరు యెంత బాగా విడదీసి చెప్పారండీ! నాకీబాధ యెందుకు వచ్చిందంటె....రేపు తెలియచేస్తానులెండి. రేపే మీ సలహా ఆచరణలో పెడతాను. ఈ యింటో నా బతుకు చాలా కష్టంగా వుంది. నా మనసు యెన్నడో ఒక అద్భుత వ్యక్తికి సమర్పిత మయింది. (నా వంక అతి నాజూకుగా చూసింది.)

"ఎవరంటారా? మీకే తెలుసు? తెలీకపోతే రేపు చెపుతాను. ఈవేళ పొద్దుపోయింది. మీకు అతను బాగా తెలుసు-మీ అంతబాగామా.

(నా వొళ్ళుప్పొంగింది. చమత్కారం మనిషి!) "....ఉండండి.... వొదలండి....యీ యింటోనుంచి వొచ్చేస్తేనే గాని నాకేమీ తోచదు."

నా నుంచి తప్పించుకుని మామూలు ముద్దన్నా యివ్వకుండా వెళ్ళి పోయింది.

దోవలో ఒకటే ఆలోచన. నా స్వర్గ సౌఖ్యాన్ని గురించి. రేపు సాయింత్రం ఈ అమ్మాయిని యెక్కడికి లేవతీసుకుని వెళ్ళను! ఇన్ని పద్యాలు రాసి, యింత బోధించి వెనక్కి తగ్గనా? నా చదువేమైతేనేం, అమ్మాయేమైతేనేం? ప్రేమయెదుట అన్నీ తొలగిపోవలసిందే ఇంటి దగ్గర్నించి నాలుగువొందలు సంసాదించవొచ్చు వారంలో - చెన్నపట్నం వెడితే ?

మర్నాడు సాయిం్రతం గదిలో షోకు చేసుకుంటో నుంచున్నా. ఈ హనుమంతరావు. రోజల్లా కనపడలేదు. ఏమైనాడో? వాడితో చెప్పనా? వాడి వేదాంతం గోలలో ఈ రసికత్వం వినపడుతుందా? దరిద్రుడు యిరవై యేళ్ళకే ఆ వేదాంతమేమిటి? పాపం యెంత కర్మం పట్టిందో. వెధవ, వాడి గోలెందుకు? వెళ్ళాలి. కిటికీకింద వుత్తరముంది.

"నా జాతకం తిరిగింది, ఉత్తసందేహాలతో నన్ను పొమ్మన్న సుందరి నన్నలాత్తుగా నీ బోధచేత అంగీకరించింది, ఈవేళ. మా యిద్దరి వందనాలు. ఇద్దరం వెళ్ళిపోతున్నాము. కాఫీహోటలు బాకీకి పైకం లేదు. నువ్వీచ్చెయ్యి.

- హనుమంతరావు"

★ ★ ★

# వొంటరి తనం

యెంత రాత్రైనా ఇంటికి వెళ్ళడమంటే, దిగులు పుట్టించే, ఎండాకాలపు సాయంత్రమది. దక్షిణపు గాలితో కంఠం కలిపి సూర్యనారాయణ పాడుతోవుంటే యింటికి రావడం ఆలశ్యమయిందని రెండుగంటలసేపు మాట్లాడకుండా, మొహం ముడుచుకునే భార్యా, రాక్షసులవలె తగూలాడే నలుగురు పిల్లలూ, నాటకంలో హిరణ్యకశివుడు వలె కోర్టునంతా తన రంగ స్థలంలాగు చూసుకుని నాట్యమడే శిరద్దారూ, లోకంలో వున్నారనే సంగతినే మరచిపోయి గాన ప్రపంచ వీధుల్లో స్వేచ్ఛావర్తనం సల్పుతున్నాను. కాని కడుపులో చురచుర, పెరుగుపచ్చడినీ, పప్పుపులుసునీ, దానితోటి రాచ్చిప్పనీ, దీపం శెమ్మనీ, వంటింటివి, భార్యానీ, జ్ఞాపకానికి తెచ్చింది.

"లేద్దాం" అన్నాను, కష్టం మీద దిగులుతో.

"యేం అంత తొందర!" అన్నాడు ఒకడు.

"కడుపులో మండుతుంది" అన్నాను.

"వీడు యెప్పుడూ యిట్లానే తొందరపడతాడు. ఏదో యింటి దగ్గిర అనుమానం యేడిపిస్తోంది"

"అనుమానముంటే మాత్రం; యేం చేస్తాడేం ?"

"కనుక్కుని రూఢి చేసుకుంటాడు, తొరగాపోయి."

"అట్లా అనుమానంగా వుంచితేనే మంచిది. రూఢి చేసుకుంటే అదో తంటా."

"తంటా యేముంది? యిద్దర్నీ పక్కలు విరగ తంతాడు."

"తంతాడా? తన్నడమే! ఇట్లాంటివాళ్ళని చాలామందిని చూశాం."

"లేకపోతే, వూరుకుంటాడా ?"

"ఎవరో చాతగాని ఆడముండ వూరుకోవాలి గాని, మనవాడు..."

"మొగ రాక్షసుడైనా యేమీ చెయ్యలేడు. భార్యనీ, విటుణ్ణీ కసిదీరా స్వేచ్ఛగా కండలు చెక్కే కాలం దాటిపోయింది. ఎంతకాలమని భార్యని తాళాలు వెయ్యగలడు? అందులో పిల్లలతో సహా అడ్డపెట్టడం అసాధ్యం. బైటపడితే పరువునష్టం ... అదంతా యెందుకు ? యిందాక నలుగురు చక్కని పిల్లల్ని వెంటబెట్టుకు యిట్లా వెళ్ళలా, ముసలాయన. ఆయన సంగతేమయింది చెపుదూ ? మళ్ళీ యవ్వనంలో వున్నప్పుడు మనుషుల్ని కాల్చుకుతినే వాడిలాగ కనపడేవాడు ! పోలీసు డిస్ట్రీ సూపరిండెంటు పని.... మొదటినించి చెపుతాను వినండి. ఈసారి ఆయన కనపడ్డప్పుడు ఆ పెద్ద పిల్లల ముగ్గురి మొహాలు చూడండి; ఆ చివరిదాని మొహం చూడండి. నా కథ వాస్తవం మీకే తేలుతుంది.

ఆయనపేరు వెంకటబ్రహ్మం. ఆ పేరు చెపితే చాలు, దొంగలకే కాదు, మంచివాళ్ళకీ, మేస్ట్రేటుకీ, తక్కిన యినస్పెక్టర్లకీ హడలు. కాని యింటికి వెళ్ళగానే అతని తీరే మారిపోయేది. చంటిప్లివాడై తన పిల్లలతో ఆటలు, గంతులు వీటితో కాలంగడిపేవాడు. పిల్లలే అతనికి ప్రాణం. వాళ్ళకోసమే జీవించేవాడు. ఆస్థి, డబ్బు, ఉద్యోగం, అన్నీ వాళ్ళకోసమే. ఆ పిల్లలకీ యితనంటే అంత ప్రేమా, సంతోషమూను. అతన్నెరిగిన వాళ్ళందరూ అతను చాలా అదృష్టవంతుడనుకునే వాళ్ళు.

చదువుకోసం పిల్లల్ని రాజోలులో వొదలి, ఆఫీసుబోటులో తనూ, భార్యా, పసికుర్రాడూ సర్కీటు వెళ్ళారు. ఒకరోజు రాత్రిపడ్డాక వొస్తానన్నవాడు పని తొరగా ముగియడంచేత, వెంకటబ్రహ్మం మధ్యాహ్నం నాలిగింటికే వొచ్చి తన రైటరు, తన పడక గదిలోనించి, తొరతొరగా ఆఫీసుగదిలోకి పోవడం చూశాడు. తరువాత రెండురోజులు జాగ్రత్తగా కనిపెట్టేటప్పటికి, అతని అనుమానం నిశ్చయమయింది. అతనివొళ్ళు వెర్రెత్తింది మొదటినించీ తన భార్య సుభద్ర ప్రవర్తన తలుచుకుంటే, అన్నీ అనుమానంగానే కనపడ్డాయి.



యిప్పుడు ఆ రైటర్ని చూస్తే వెంకట బ్రహ్మానికి అసలే చాలా అసహ్యం. తనభార్య అల్లాంటివాణ్ణి యేరుకోడం చాలా నీచంగా తోచి బాధపడ్డాడు. సుభద్రని తిట్టినా, కొట్టినా, చావతన్నినా, ఏమీ లాభంలేదని అతని పూర్వానుభవం వల్ల తెలుసు. అదిగాక పెద్దదై ముగ్గురు పిల్లల తల్లి అయి యిన్నాళ్లు అతనితో కలిసి కష్టసుఖాలు పంచుకున్నదాన్ని చెయ్యి చేసుకోవడం అతనికి మనస్కరించలేదు. ఆలోచించి ఆలోచించి అట్లాంటివి సాగడానికి వీల్లేదని కఠినంగా భార్యతో చెప్పాడు.

యిప్పుడు వెంకటబ్రహ్మం గారికి గుండెల్ని పీక్కుతినే పెద్ద సందేహం ఒకటి పట్టుకుంది. యీ ముగ్గురు పిల్లలూ తన పిల్లలవునా, కాదా అని. వాళ్ళల్లో తనవాళ్ళెందరో కానివాళ్ళెందరో పూర్వపు సందర్భాలన్నీ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. వాళ్ళు దగ్గరికి వొచ్చినప్పుడల్లా తన మొహం వాళ్ళ మొహాలు సరకాయించి పోల్చుకుని, పరధ్యానంలో పడేవాడు. వాళ్ళమీది అపారమైన ప్రేమ, వాళ్ళు తన వాళ్ళు కారేమో, యిన్నాళ్ళూ యెవళ్ళనో, తన బిడ్డలని పిలుస్తో, ప్రేమిస్తో వాళ్ళకోసం తన శక్తినంతా యిచ్చేసి, బాధలు పడడం-యివన్నీ అతన్ని నరకబాధ పెడుతున్నాయి. తన భార్యని నిజం చెప్పమని అడిగితే చెబుతుందా? అందులో యింత పోట్లాటగా వున్నప్పుడు!

వారం రోజుల్లో తన భార్య నడవడి యధాప్రకారంగానే వుందని అతనికి బాగా తెలిసింది. యీసారి చాలా కఠినంగా మాట్లాడేటప్పటికి "సరేలే; నేనే బైటికి వెళ్ళిపోతా" నంది సుభద్ర. ఆ మాటతో పులివంటి వెంకటబ్రహ్మంగారి దూకుడంతా అణిగింది. ఈ అసహ్యంపడలేక, పొమ్మ నాలని నాలికదాకా వొచ్చింది. కానీ వెంటనే, వేరే ఆలోచన వొచ్చింది. తన పరువు సంగతి తెలుసుకున్నాడు. యిన్‌స్పెక్టర్లూ, చివరికి పోలీసు జవాన్లూ, తన వ్యవహారం గుంపులు గుంపులుగూడి మాట్లాడుకోడం, తన ముందు శాల్యూటుపెట్టి, వెనకాలే నవ్వడం, తన బంధువులు తనని వోదార్చడం, "పెళ్ళాన్ని అదుపులో పెట్టలేనివాడు వూళ్ళని అదుపులో పెడతాట్ట ?" అనుకోడం అన్నీ కళ్ళకు తట్టాయి. తెలివిగా అప్పటికి వూరుకుని తరువాత చెయ్యవలసిన సంగతేమిటని ఆలోచించి, ముందు ఆ రైటరుమీద రిపోర్టు రాసి బదిలీ చేయించాడు. అతను వూరంతా గోలపెట్టి శెలవు తీసుకొని అక్కడే వున్నాడు.

అతన్ని తన్నించాలని చూశాడు. కాని అతను చాలామందికి యిష్టుడు కావడంచాతా, జాగ్రత్తగా వుండడంచాతా, అది చాతకాకపోయింది. తన యింటిలోనే వాణ్ణి పట్టుకుని తన్నడానికి సిద్ధమైతే, భార్య పిల్లలతో సహా రోడ్డుమీద పడియేడ్చి గోలచేసేటంతవరకై, సిగ్గుపడి వూరకున్నాడు. యిల్లు నరకమైపోయింది. భార్యమొహం చూసినప్పుడల్లా కొరికి చీల్చి, యేడిపించాలన్నంత కోపమైపొయ్యేది, కాని ఒక్క మాటంటే లేచిపోతుందని భయం. ఆ పిల్లల్ని చూడగానే, వాళ్ళు 'నాన్నా' అని ఎప్పటి ప్రేమతోవచ్చి మెడని కావిలించుకోగానే, వొళ్లంతా జెర్రులు పాకినట్లవుతుంది. కాని వాళ్ళని వొదల్లేదు. వాళ్ళ ప్రేమ లేకుండా ఉండలేడు. ఆ రైటరు శెలవెప్పుడై పోతుందా అని ధ్యానం చేసుకుంటో యీ బాధనంతా భరిస్తున్నాడు. వూరంతా ఇతనంటే నవ్వులాటై పోయినట్టుంది. అతనికి వీపు వెనకాల, 'రైటర్' అని కేకలు వేస్తున్నారనుకున్నాడు. గోడలమీదా, రైలుబళ్ళల్లో, భార్యపేరు వెలుగుతోంది. శలవ అయిపోగానే రైటరు పనికి రాజీనామాయిచ్చి చీరెలకొట్టు పెట్టాడు. ఆ రైటర్ని చంపెయ్యాలన్నంత కోపమొచ్చింది. ఒక్కొక్కరాత్రి నిజంగా ఏ కోపంలోనో యేదో చేస్తానని అతనికి భయం కలిగింది, ఏం చెయ్యాలి?

పోనీ, తాను బదిలీ తెప్పించుకుంటే? బావుంది. పైకి వ్రాశాడు. వాడు వొస్తే ఆ కొత్తవూరు. కాని పరాయివూళ్ళో వాణ్ణి నడుం విరిగేటట్టు తన్నించడం వో గొప్పకాదు. ప్రయత్నించగా ప్రయత్నించగా మూణ్ణెల్లకి విశాఖపట్నం మార్చారు. ఆ బదిలీతో వెంకటబ్రహ్మానికి తన చిక్కులన్నీ తీరినట్టు, ప్రపంచంలో మళ్ళీ ఆనందమూ, ఆరోగ్యమూ, శాంతీ వున్నట్టు తోచింది. ఇప్పుడేం చేస్తుంది? తన భార్య పొందగల దిగులును చూసి అతనికి చాలా సంతోషం పొంగి పొంగి వచ్చింది. కానీ, దీని పని ఆ వూళ్ళో పట్టించాలి.

తీరా ప్రయాణమయ్యే సరికి సుభద్ర ఆ వూరినుంచి కదిలిరానంది. ఆ మాటతో అతనికి గుండె ఆగిపోయింది. అంత సాహసం చేస్తుందని అతను కలలోకూడా అనుకోలేదు. బహిరంగంగా తనని వొదిలి వాడితో వుంటుందా?

"నువ్వు రానంటేమాత్రం, నేను వెళ్ళక యెట్టా తప్పుతుంది?"

"వెడితే వెళ్ళండి, వుంటే వుండండి, నేనీవూరు విడిచిరాను."



తనలో ఏం లోపముంది? అతనిలో ఏం విశేషముంది? లేక ఆ స్త్రీ స్వభావమే అదా? మళ్ళీ తను కోరినప్పుడల్లా మాట్టాడకంటా లోబడుతుంది, తన దగ్గిర చేరకపోతే లక్ష్యం చెయ్యదు. కులాసాగా తనతో అనుభవిస్తుంది. వాడితోనూ అనుభవిస్తుంది. ఒక రాత్రి దయగా అడిగాడు ఆమెని-

"ఎందుకు అతన్ని వదలలేవు? నన్ను చూస్తే అసహ్యమా?"

"లేదు."

"ఐతే?"

"మీకు తెలీదు. చెప్పడం నాకు తెలీదు."

ఆమెని లాక్కెళ్లాలని చూశాడు. అల్లరికింద దిగింది. రోడ్డుమీద రాగాలు పెట్టేవిషయం కిందికి వొచ్చింది. ఆఖరునాటి రాత్రి భార్య కాళ్ళ మీదపడి బతిమాలాడనికూడా అంటారు. కాశీకిపోయి సన్యాసం పుచ్చుకోడానికి నిశ్చయించుకుని సగందూరం బయలుదేరార్ట. పిల్లలమీద ప్రేమ ఆ నిశ్చయాన్ని చెడకొట్టింది. ఆ పిల్లల్ని తీసుకుని విశాఖపట్నం వెళ్ళిపోయినాడు. ఒక వంట ఆమెనీ, ఆయానీ ఏర్పరచుకుని స్థిరపడ్డాడు. పదిహేనురోజుల్లో బతుకు దుర్భరమైపోయింది. కచీరికి పిల్లలు కదలనిచ్చే వాల్ళు కాదు. సైకిలెక్కి బయలుదేరితే ఆయా చేతుల్లో నిలవక ఏడుస్తో రోడ్డువెంట పడతారు. కచేర్నించి రాగానే, ఆ ముగ్గురూ యితన్ని కావిలించుకుని, "అమ్మ, అమ్మ" అని ఒకటే గుండె కరిగేట్టు యేడుపు. చంటి పిల్లవాడు దిగులుతో శల్యమౌతున్నాడు, ఆ నౌకర్లు యీపిల్లల్ని సరిగా చూట్టం లేదని, నౌకర్లని మార్చి నౌకర్లని పెట్టినా, లాభంలేదని తెలిసింది. తను యెన్నడో మరిచిపోయిన బంధువుల నందరినీ ముఖ్యం ముసలి వితంతువులని జ్ఞాపకం తెచ్చుకుని, రప్పించాలని చూస్తే, ఒక్కరూ దొరకలేదు; అసలు బంధువులు తక్కువ; వుద్యోగగర్వంతో వాళ్ళతో యెక్కువ సంబంధం పెట్టుకోలేదు. వాళ్ళందరికీ యీ గోలంతా తెలిసి, ఇతన్ని సగం వెలివడ్డవాడివలె చూస్తున్నారు. రాజమహేంద్రవరం శరణాలయానికి వెళ్ళి, వితంతు వివాహం చేసుకుంటా నన్నాడు. ఇతని చరిత్రవిని, ఆ భార్యనంత చక్కగా చూసుకున్నావు, ఇక యీ భార్యని యెంత బాగా చూసుకుంటావో, వెళ్ళమన్నారు. సిగ్గేసి

ఇంటికొచ్చాడు. పిల్లలు అన్నంతినటం లేదు. ఆడుకోరు. రాత్రులు ముగ్గురు వూపిరాడకండా చుట్టూ కావలించుకొని గాని నిద్రపోరు. ఇట్లా యిం పదిరోజులు యేడిపించేప్పటికి, వాళ్ళమీది ప్రేమ అంతా యెగిరిపోయింది వాళ్ళ మొహాలు కనపడేప్పటికి ఎక్కడికి పారిపోదామా అనిపించేది ఆఫీసునించి ఇంటికి వెళ్ళడమంటే హడలుగావుంది. ఆ తల్లి లేని పిల్లల్ని తనుకూడా విసుక్కోడం, కొట్టడం సాగించాడు. అంతేగాక, వీళ్లు తన బిడ్డలవునా కాదా, యీ శ్రమలూ, బాధలూ, యెవరెవరి పిల్లలకోసమో పడుతున్నానా, అనే సంగతి అతని హృదయాన్ని ఒక్క నిమిషం బాధించడం మానలేదు. రాత్రులు నరాలు లాగి, గుండె పట్టుకుని, నిద్రపట్టక బాధపడతాడు. లాంతరు తీసుకొచ్చి భద్రంగా వాళ్ళ మొహాలు వెతుకుతాడు. యీ పిల్లల్ని వొదిలి తన భార్య యెట్లా వుందా అని ఆశ్చర్యమూ, నిలవలేక వొచ్చేస్తుందేమోననే ఆశా, మళ్ళీ రానిస్తానా అనే కోపమూ, పిల్ల మీదవున్న ప్రేమనంతా చంపుకున్న ఆ స్త్రీ వికృత స్వభావానికి అసహ్యమూ, యిన్ని భావాలూ అతనిలో పుడుతో ఉంటాయి. ఆ ముగ్గురికీ ఫొటో తీయించి ఫొటోగ్రాపర్ని భార్యకి పంపమన్నాడు. యెందుకో బాగా తెలీదు. యేవేవో కారణాలు చెప్పుకుని సమాధాన పెట్టుకున్నాడు. యెంత అఖ్ఖర్లేకపోయినా తల్లి కదా, పిల్లల్ని చూడాలని వుండదా, ఆమెకి హృదయం లేకపోతే తనకి లేదా అనుకున్నాడు. ఇంతలో రెండోపిల్ల వాడికి మరాత్తుగా పెద్ద జ్వరం వొచ్చింది. సెలవ పుచ్చుకుని, రాత్రింబవళ్లు అతనికి సేవచేశాడు. ఒకరోజు రాత్రి ఆ పిల్లవాడి పక్కన కూచునివుండగా ఆ జబ్బూ, ఆ కుర్రవాడి అసహాయత్వం, వాడి అమాయకమైన ప్రేమా, అన్నీ తలుపుకువొచ్చాయి. అమ్మదగ్గిర్నించి, యెందుకు తీసుకొచ్చావని అడగరు, మమ్మల్ని వొంటరిగా నౌకర్లమీద పారేసి, కష్టాలు పెట్టడానికి చేతులెట్లా వొచ్చాయి అనరు. ఎందుకుయిట్లా కొడతావు, తిడతావనరు. తనని నమ్మి యిట్లా జబ్బులు తెచ్చుకుని, ఆ చేదుమందులు గొంతుకలో పోసుకుంటో, చావుకుకూడా సిద్ధమవుతారు. వెంకట బ్రహ్మానికి యెంతో యేడుపొచ్చింది. ఆ అబ్బాయిని విసుకుతో తను కొట్టిన దెబ్బలూ. ఆ బాధ పడలేక వాడు పెట్టిన మొహము అన్నీ జ్ఞాపకం వొచ్చి, యేడ్చాడు. ఇంకతన దగ్గిర వీళ్ళని వుంచుకోకూడదు తన పరువుపోయినా సరే, అనుకుని, ఆ జబ్బు నయంకాగానే, ముగ్గురు



పిల్లల్నీ, తీసుకుని ఆ రైటరూ, తనభార్య తను పూర్వంవున్న యింటోనే కాపం చేస్తోవుంటే, అక్కడికి వెళ్లాడు. రైటర్ని 'పర్మిషన్' అడిగి, ఆమెతో మాట్లాడి సగం జీతం పంపేందుకు వొప్పుకుని, ఆ పిల్లల్ని ఆమె దగ్గిర దిగపెడ్డాడు. ఆ రోజు రాత్రి యితన్ని వాళ్ళు అక్కడే భోజనానికి వుండమన్నారు. కాని అతను వుండలేదు.

ఆ పిల్లల్ని దిగపెట్టి వొచ్చిననాటినుంచి వాళ్ళమీద మళ్ళీ అమితమైన ప్రేమ మొదలుపెట్టింది. వాళ్లేమీ అల్లరి చెయ్యలేదనీ, తనే అన్యాయంగా వాళ్ళని బాధపెట్టాననీ అనుకున్నాడు. వాళ్ళని మళ్ళీ చూడాలనే కోర్కెని అణుచుకోలేక అవస్తపడ్డాడు. మెల్లిగా మరిచిపోయినాడు. మూడేళ్ళు ఎట్లాగైతేనేం తోసుకు తిరిగాడు. తరువాత వాళ్ళని వొక్కసారన్నా చూడకుండా వుండడం అసాధ్యమై పోయింది. వాళ్ళు బతికి వున్నారో లేదో కూడా తెలీదు.

యెవరన్నా ఆవూరి స్నేహితుల్ని మన పిల్లలెట్లా వున్నారో చూసి, రాయమంటే యెట్లా వుంటుంది ? తను ఆవూరుకు వెడితే అందరూ తెలిసి నవ్వుకోరూ ? ఒకరోజు తన పెద్దబ్బాయి బళ్ళో కుర్రాడితో పోట్లాడి, దెబ్బలు తిని యింటికి వెళ్ళినట్టూ, యింట్లోవాళ్ళుకూడా చీవాట్లు పెడితే, తనని తలుచుకుని యేడుస్తున్నట్టూ, కలవొచ్చింది. కలలోంచి మెళుకువ రాగానే, పిల్లలకోసం, వేదన ప్రారంభమయింది. ఆ రైటరూ తన భార్య, తన పిల్లల్ని యెంత బాధపెడుతున్నారో, అని భయం పట్టుకుంది. ఆ పిల్లలు తనకోసం యేడుస్తున్నట్టేవుంది. మర్నాడు రాజోలు రాత్రికి చేరుకునేట్టు ప్రయాణమైనాడు. దొంగతనంతా వాళ్ళయింటికి కిటికీదగ్గర చీకట్లోనుంచుని, లోపలికి చూశాడు. రైటర్ చుట్ట కాలుస్తో వరండాలో కుర్చీలో పడుకున్నాడు. తన పెద్దకుర్రాడు గదిలో పాఠం చదువుకుంటో అప్పుడప్పుడు ఆ రైటర్ని 'బాబాయ్' అని పిలిచి సందేహా లడుగుతున్నాడు. సుభద్ర ఆ గదిలోనే మంచంమీద కూర్చుని చిన్నపిల్లకి పాట నేర్పుతోంది. రెండో కుర్రాడు ఆ రైటరు సైకిలు గోడనానించి వుంటే యెక్కాలని ప్రయత్నం చేస్తున్నాడు. యిదంతా వెంకట బ్రహ్మంగారు చూశాడు. ఆ యిల్లుఎంతో 'కంఫర్టబుల్'గా, సుఖంగా వున్నట్టు కనపడ్డది. ఆ సంసారం, ఆ ఆనందం, ఆ మూడేళ్లు వొదులుకొని యేకాకినై నానుకదా అని దిగులేసింది. సుభద్రమ్మ కూడా యిదివరకటికంటే అందంగా

కనబడుతోంది. యింత పెద్దలోకంలో తన వొంటరితనం ఘోరంగా తట్టింది మనసుకి. కాంతిలో స్వర్గంలో వాళ్ళుంటే, చచ్చిపోయినవాడి దెయ్యంలాగు తనింకేదో లోకంనించి దిగి వొచ్చి వాళ్ళని, తనవాళ్ళని చూస్తున్నట్లయింది. గుండెలు పీక్కుపోయినాయి. ఒక్కసారి ఆ పిల్లల్ని కావలించుకోవాలని పించింది. క్లెయిము తెచ్చిన 'రిపొరాలు' ఏమిటో ఆ పెద్దకుర్రాడికి విప్పిచెప్పి, ఆ చిన్న కొడుకుని ఒళ్ళో కూచోపెట్టుకుని, ఆ రెండోవాణ్ణి సైకిలుమీద పడకండా నిలబెట్టాలని కోర్కి ఏడిపించింది. చివరకి ఆ యింటో కాలుపెట్టడానికి తనకర్హత లేదనుకొని వెళ్ళిపోయి, ఆ రాత్రే రైలెక్కాడు.

వాళ్ళని చూసిన తరవాత అతని జీవితం దుర్భరమైపోయింది. ప్రతి నిమిషమూ బతుకు వొంటరిగా వున్నదనిపిస్తోంది. సంపాయించడం ఎందుకూ? యీ నౌకర్లెందుకూ ? హోదా ఎందుకూ ? హోటళ్ళలో భోజనం, ఎక్కడో గదిలో నిద్ర! సంసారాల్లోకి యితన్ని రానీరు. ఎవరూ శుభకార్యాల కొట్టి పిలువరు. పిలిచినా బంధువుల్ని చూడ్డానికి సిగ్గు. నా వాళ్ళనుకునేవాళ్ళు లేరు. 'ప్రమోషన్' వొస్తే, సంతోషం చెప్పుకునేందుకన్నా ఎవరూ లేరు. మంచి చీర చూస్తే నగలు చూస్తే, బొమ్మలు చూస్తే, ఎవరికన్నా కొనిపెట్టాలనిపించేది. జబ్బుచేస్తే యెట్లా వుందని పలకిరించే వాళ్ళు లేరు. ఆ పిల్లలు కావాలి కావాలని రాత్రింబవళ్లు అరిచేదిహృదయం, వాళ్ళలో ఒక్కరన్నా తన సొంతపిల్లలై వుంటారని నిశ్చయించుకున్నాడు. సంగతులన్నీ జ్ఞాపకం తెచ్చుకుని వాళ్ళ ఫోటోలు, తన ఫోటో దగ్గరగా పెట్టుకొని పోలికలు చూసుకుంటాడు. కాని ఏం చేస్తాడు. అట్లానే కుళ్ళుతో కాలం గడుపుతున్నాడు.

తరువాత నాలుగేళ్ళకి పాపం ఆ రైటరు చచ్చిపోయినాడు. తరువాత రెండునెలల్లో వెంకటబ్రహ్మం, సుభద్రా, వెంకటబ్రహ్మం ముగ్గురు కొడుకులూ, ఆ రైటరుకి పుట్టిన చంటిపిల్లా అందరూ సుఖంగా కాపురం చేస్తున్నారు. వెంకటబ్రహ్మం పెన్షన్ పుచ్చుకుని, ఆ పాత ఇంట్లోనే స్థిరపడ్డాడు. ఇప్పుడుకూడా వాళ్ళ హాల్లో ఆ రైటరుది పెద్ద ఫొటో వుంది. వెంకటబ్రహ్మంగారి ముగ్గురు పిల్లలూ ఆ రైటర్నే బాబాయి అంటారు. ఆ రైటరు కూతురు మాత్రం యీయన్ని 'నాన్నగా' రంటుంది.

★ ★ ★

# నేనూ, మా ఆవిడా మిగిలాం

నేను అందమైనవాణ్ణనిగాని, నా రూపం యింకొకర్ని ఆకర్షిస్తుందనిగాని, నేనెన్నడూ అనుకోలేదు. అనుకోడం అసంభవం. కాకి పిల్ల కాకికి ముద్దంటారుగాని, మా అమ్మకూడా నా ముఖం ఒకటిన్నర నిమిషంకంటె యెక్కువసేపు చూడటం భరించలేకపోయేది. ముద్దుకి దగ్గిర చేరానంటే, "కొంచెంసేపు వెళ్ళి ఆడుకో నాయనా!" అనేది ఇంక బంధువులు సరేసరి. దౌర్భాగ్యురాలి. ఒక పిల్లని చిన్నప్పుడే నాకు కట్టారు గానియెదిగింతర్వాత నన్నుచూసి యెవతా పెళ్ళిచేసుకుని వుండదని నా దృఢ నిశ్చయం. కాని నా భార్యకి తక్కినవాళ్ళకి లేని ఒక అదృష్టం కలిగింది. తన భర్త ఎంగి లవుతాడనిగాని, తనని మరచిబోయి యితరుల వలలో పడతాడనికాని, భయమూ, యీర్ష్యా ఏమీ వుండనక్కరలేదు. పెద్ద వుత్సవంలోనైనా నేను మారిపోతాననిగాని, నన్నెత్తుకుపోతారనిగాని, మా అమ్మకే వుండేదికాదు బెంగ. నా మొహం కనపడకపోతేనే చాలునని, నే నడగ్గానే, ఆ వూళ్ళోనే బడిపంతులు పని యిచ్చేశాడు, ప్రెసిడెంటుగారు. నేను చదువుకునేప్పుడూ అంతే. చప్పున నన్ను ప్యాసుచేసి పై క్లాసుకి పంపేవారు నా టీచర్లు.

నామీద నిజమైన యిష్టంగలవారు మా హెడ్‌మాష్టరుగారొక్కరూ. ఆయన యింటికీ, మా యింటికి తాటాకుల దడిమాత్రమే అడ్డం, ఆయన భార్యకి దగ్గిర దగ్గిరగా నలభై యేళ్ళుంటాయి. ఆమెని చూడగానే పగలబోయే పచ్చని పెద్ద గుమ్మడిపళ్లూ, నిండా దూదికూరిన మెత్తనిదిళ్ళూ, నిండు పాడిగేదెలూ, జ్ఞాపకమొస్తాయి.

అసలు మొదలు ఒక వుదయం. నేను దొడ్లోంచి వొస్తోవుంటే యెవరో నావంక నిదానంగా చూస్తున్నట్టు, అనుమానం తగిలి, వెనక్కి తిరిగిచూస్తే,

హెడ్మాష్టరుగారి భార్య రత్తమ్మగారు కనపడ్డారు. నేనేం తప్పు పనిచేశా
స్నానంచేసిన నీళ్ళు మళ్ళా వాళ్ళ దొడ్లోకి వెళ్ళాయా, పొద్దున్నే నేను భార్యమీ
వేసిన కేకలు వినపడ్డాయా, నా మొహం అందానికి యింకా యామన్నా కొ
అభివృద్ధి కలిగిందా అనుకుని యింటోకి వెళ్ళి, నా భార్యతో ఆలోచించాను

"యీవాళేమిటి? మీవంక అట్లా చాలారోజుల్నుంచి చూస్తోంది."

"ఛా!"

"నిజమే."

"ఎందుకు?"

"ఏమో! అడగండి. చెప్పతీసుకు కొట్టేవాడులేక!'

హడిలిపోయినాను. వాళ్ళు వింటే దీని అరుపులు!

"ఛీ! నోరుముయ్యి."

ఇదేమిటి? నా భార్యకి కూడా ఈర్ష్యేనా! అనుకున్నాను. కాని, న
ప్రతాపానికి గర్వం కలక్కపోలేదు. చివరికి నేను కూడా ఘనత కెక్కాను. కా
నమ్మకం కుదరలేదు, నిజమా? వుత్త దీని అనుమానాలా?

మర్నాటినుంచి పక్కదొడ్డికేసి అప్రయత్నంగా నా కళ్ళు తిరుగు
తున్నాయి. నాకేమీ దురుద్దేశమూ లేదు, ఆశా లేదు. వూరికేనే, 'క్యూరియాసిటీ'
ఆపుకోలేక చూశాను.

నేను దొడ్లోకి వెళ్ళినప్పుడల్లా అక్కడ వుండేది, బావిదగ్గర. ఆ చూపుల
నావంక చూసే చూపులు, నన్ను లాగేయ్యాలనీ, నన్ను దగ్ధం చెయ్యాలనీ
చూస్తునట్టుండేవి. నే నేమనుకోను? నమ్మడం ఎంత ఇష్టం లేకపోయినా,
యెట్లా నమ్మక తప్పించుకోను? ఆ చుపులూ, చిన్వాలూ- పన్వాలూ,
పదిహేనేళ్ళ పిల్లలలోనూ నలభైయేళ్ళ స్త్రీలోనూ వొకటే. మొదట నమ్మలేదు
నేను, తరవాత నిజమా అని ఆలోచించాను. నిశ్చయమైన కొద్దీ, నేను కొంచెం
సొజ్ఞలు మెదలుపెట్టాను. నేను ఏం చేస్తున్నానో, యే లోకంలో వున్నానో
తెలీదు. నన్నూ స్త్రీ కోరింది. అందులో దబ్బ పండువంటి అందమైనది, అంత
గొప్పది హెడ్మాష్టరుగారి భార్య! నన్ను! నన్ను !



మెల్లిగా మాటలదగ్గిరికి వెకిలినవ్వుల దగ్గిరికి, దిగులుతో కంటతడి దగ్గిరికీ వొచ్చింది మా స్నేహం! ఐనా నాకింకా అట్లాంటి తలపులేదు. దృఢంగా కలగలేదు.

అదేం చప్పుడు? మెలుకువ వచ్చింది. నా భార్య చప్పుడు ఒంటింటిలో నంటుంది. చప్పుడూ లేదు, యేమీలేదు వెళ్ళనంటాను, భయంతో. నా ధైర్యాన్ని, మగతనాన్ని గేలిచేసి కర్ర చేతికిచ్చి వెళ్ళమంది. కాని తాను కదలదు. చివరికి పోరు పడలేక వంటింటి తలుపుతీసి, లాంతరుతో వెతికాను. ఏమీలేదని దానికి కేకేశాను. "దొడ్డితలుపుకూడా తీసిచూడండి? అరటి గెల కోసికెళ్ళారేమో?" భయంతో వొణుకుతున్న వేళ్ళతో తలుపుతీసి చూసేటప్పటికి ముందు తెల్లని ఆకారం కనబడ్డది. అరవడానికికూడా శక్తి లేక నిర్ఘాంతపోయి నుంచున్నాను. ఆవెు కదిలి నన్ను రమ్మని సొజ్ఞ చేసిందాకా, రత్తమ్మగారనుకోలేదు. లాంతరు వంటింటిలోనే వొదిలి, దొడ్లోకి వెళ్ళాను. వెంటనే నన్ను గట్టిగా కావిలించుకుని, మెత్తటి శరీరంమీద నన్ను యిట అటూ తిప్పుకుని, వెర్రిప్రేమ అంటో, అట్లాంటి వుపకారము చెయ్యకుండా సరిపుచ్చింది, చూపించింది. ఎన్ని నిమిషా లయిందో! "యామండీ! ఏం చేస్తున్నారు?" అన్న అరుపు విని వొదిలేసింది. వెళ్ళి పక్కమీద పడుకున్నాను.

నిజంగా, చెపుతున్నా. నా కామెతో ఈ సంబంధం మొదట యేమీ యిష్టంలేదు. భయం వేసింది, అసహ్యమేసింది. కాని నా వంటివాణ్ణి ఆమె కోరిందనే సంతోషమూ, నాకూ ప్రేమరాజ్యంలో స్థానమిచ్చినందుకు కృతజ్ఞతా, ఆమె మీద పోలేదు. పగలంతా యెంత కష్టంలేకపోయినా, రాత్రి పన్నెండుగంటలకి అప్రయత్నంగా మెళుకువ వొచ్చి, అప్రయత్నంగా దొడ్లోకి వెళ్ళేవాణ్ణి. ఆమె, అంత గొప్పామె నాకోసం కాచుకొని వుంటే-నాకోసం! ఆగగలనా? ఇంక వెళ్లింతరువాత ఆమె నన్ను వెర్రిగా భయంకరంగా మోహంచూపి వుపయోగించుకునేది. ఆమె అనుభవానికి ఆ రాత్రే గడువున్నట్టూ ఇంత జీవితమే లేనట్టూ నన్ను నలిపేసేది. నాకు మాట్లాడ్డానికిగాని, వూపిరి పీల్చడానికిగాని, కాలుచేతులు కదపటానికిగాని వ్యవధాన మివ్వదు. ఇట్లా అయదారురోజులు జరిగింతరవాత ఒకరోజు రాత్రి

నేను తిరిగి పడుకోటానికి వచ్చేటప్పటికి నా భార్య మేలుకుని వుం "ఎక్కడికెళ్ళారు?" అంది.

"చప్పుడవుతోవుంటే వెతకడానికి వెళ్ళాను."

"ఆ రత్తమ్మగారేనా చప్పుడు చేసింది?"

చచ్చాను.

"ఇదుగో!" నేనూరుకోను. నేనూ కనిపెడుతోనేవున్నా. ఈవాళ రాత్రి వొచ్చాను. వెనకవేపు గొళ్ళెం వేసుకున్నారు. చిల్లుల్లోంచి కనపళ్ళేదనుకున్నా వెన్నెట్లో? రేపు పొద్దున్నే అడుగనూ ఆ ముండని, యిదేంబుద్ధి అని తెల్లారనీండి! ఆ మొగుడేమంటాడో?"

యింకేముంది నా గతి!నామీద ఒక్కామెకి లోకములో ప్రేమవుం అది కాస్తా చెడకొట్టేస్తుందా? అందులో ఆమె యామనుకుంటుంది? విన వాళ్ళు నమ్ముతారా? నవ్వరూ? దానికాళ్ళు పట్టుకుని తెల్లవార్లూ బతిమా వొప్పించాను. ఇంకెప్పుడూ ఆమెకోసం వెళ్ళనని నా పితృదేవతల పేర్లు వరస చెప్పి, వాళ్ళమీద ప్రమాణాలు చేస్తే అప్పుడు వూరుకుంది.

కాని మర్నాటిరాత్రి మళ్ళీ నా మనసు రత్తమ్మగారికోసం బాధించడం మొదలుపెట్టింది. నేను కావాలని స్త్రీ కోరడం, ఆ ప్రేమ చూపడం. మళ్ళీ నాకీ జన్మంలో దొరుకుతుందా ? కాని యిది దీన్నెట్లా వొదుల్చుకోడం ?

రాత్రులు దొడ్డిదగ్గిర వొకటే చప్పుడు. కిటికీలు, తలుపులు కొట్టడం, గోకడం. నా భార్య నన్ను గట్టిగా కావిలించుకుని వొదలకుండా పడుకుని, చప్పుడువిని వొకటే నవ్వడం. నన్ను రత్తమ్మగారు కోరింతరవాత నా భార్యకి నామీద మోజు కలిగినట్టు తోచింది. దీన్నీ, దీని మోజునీ, వొదుల్చుకోడమెట్లా నా మెడచుట్టూవున్న చేతులు లాగేసి పీకె నొక్కాలన్నంత కోపమొచ్చేది. అసలు దాన్ని చూస్తే నాకు భయం. ముఖ్యం యెక్కడ పిల్లని కంటుందో, ఆ పిల్ల మొహం చూసినప్పుడల్లా, నా ముఖం జ్ఞాపక మొస్తుందేమోనని ! దాని పుణ్యమా అంతవరకు. నాకే పిల్లలుంటే భరించలేక, సన్యసించి వుందును. నేను దొడ్లోంచి వెళ్ళినప్పుడల్లా రత్తమ్మగారు జాలిగా నావేపు చూస్తోంది. ఏం చెయ్యను యీ భార్యని ! వాళ్ళ అత్తకి నెప్పులు ప్రారంభమైనాయని అబద్ధం



చెప్పి, సహాయం వెళ్ళమన్నాను. మూడేళ్ళకిందట ఆ అత్తే నా రూపాన్ని వెక్కిరించిందనీ, అందువల్ల తాను తన తల్లి మొహం చూడ తలుచుకోలేదనీ అంది. వాళ్ళ పినతండ్రి పెంపుడు కూతురికి పెళ్ళి నీ, తనకి మంచి చీరెలు పెడతారనీ, వెళ్ళమన్నాను దొంగ శుభలేఖ చూపి. పెళ్ళికి వెళ్ళడానికి తనకి చీరెలూ, నగలూ లేవంది. అప్పుచేసి బనారసు చీర కొన్నాను. రత్తమ్మగారిని నగలెరువడగమన్నాను. తనకి జ్వరంగా వుందనీ, బైటవుండే రోజులనీ, వెళ్ళనంది.

చివరకి నిజంగానే బైట వుంది. ఆ రాత్రి తెగించి తలుపు తీసుకుని దొడ్లోకి వెళ్ళాను. కాని రత్తమ్మగారు లేదు. మెట్లమీద కూచున్నాను. నామీద నా పిరికితనంమీద అసహ్యం పుట్టి వెళ్లిపోయింది. ఇంక రాదు - యెంత బాధపడ్డదో పాపం! ఎంత గొప్ప అనుభవాన్ని, నా పరికితనంతో పాటు, పాడుచేసుకున్నాను. ఆమె దగ్గిర వున్నంతసేపూ వొణుకుతో భయంతో ఆమె మొహమన్నా సరిగా చూసి సంతోషించలేదు. ఈ నా పాడు జన్మకి మళ్ళీ అట్లాంటి అదృష్టం పడుతుందా ? ఆ నిండు వెన్నెల వొదిలి వెళ్ళి పడుకోటానికి బుద్ధి వెయ్యలేదు. ఆ నాడే నాకు కొంచెం ధైర్యం కలిగింది. మెల్లిగా దడిదాటి, పక్క దొడ్లోకి వెళ్ళి కిటికీ దగ్గిర గోకాను, ఆమె చేసినట్లే. రెండు నిమిషాల్లో మెల్లిగా వొచ్చింది. తలుపు తీసుకుని. పల్చని చీరె కిందకనపడే ఆమె మెత్తని పచ్చని వళ్ళూ, కాటిక పెట్టిన పెద్ద కళ్ళూ, చిక్కుగా వేళ్ళాడేజుట్టూ నా కళ్ళు తిప్పేశాయి.

ఆమెని అధికమైన కాపీనంతో కావిలించుకుని, మామూలు ప్రకారం చెట్టు కిందికి వెళ్ళే ఆలోచనన్నా లేక, అరుగు మీదనే నా బరువుతో కూలతోశాను. ఆమె కళ్ళల్లో ఆశ్చర్యం కనబడుతోంది. ఇది వరకటి మోహము, కళ్ళలో వెర్రిని చూపించటంలేదేమో అనే సందేహం కలగడానికి వ్యవధి లేదు. ఆమెని ఆమె గుండ్రతనాన్నీ, నాదిగా చేసుకోవాలని ప్రయత్నించాను. ఆ కళ్ళలోకి క్రమంగా అసహ్యము తోచింది. నా కింద చలించవలసిన ఈ మెత్తని దేహం బిగుసుకుంది. నన్నొక్క తోపుతోసి లేచి నుంచుని, బాధతో అసహ్యంతో - నా వంక రెండు మూడు సార్లు చూసి- "నిన్నా ! నిన్నా ! నిన్ను! పో, వెళ్ళిపో ముందు; పో....." ఇంకా బిగ్గిరిగా అరుస్తుందనుకున్నాను.

అంత ఆశ్చర్యంలోనూ బాధలోనూ, నీచత్వంలో కూడా, శక్తి తెచ్చుకుని మ ఇంటితలుపు దగ్గిరికి వెళ్ళి ఆగిపొయ్యే ఆశతో వెనక్కి తిరిగిచూశాను. వెన్నెల కెదురుగా, బాధా మూర్తివలె నుంచుని.

"అయ్యో! ఆయన్ని-మళ్ళీ ఎట్లా ఆయన మొహం చూడను! యేం చెయ్యను!" అని మెల్లిగా అంటూంది. ఆమె మొహం చూసి ఇంట్లోకి పరిగెత్తాను భరించలేక!

ఎంతసేపు నిద్రపోయినానో! ఏడుపులు విని లేచాను. పక్క ఇంటోకి పరిగెత్తాను. హెడ్మాష్టరుగారి భార్య కాలిపోయింది. హెడ్మాష్టరు గారు నన్ను గదిలోకి పిలిచారు.

"నాతో చెప్పింది అంతా. నీ సౌందర్యం చూసి మోహించిందనుకోకు. ఆమెని లోబరుచుకున్న వొక గ్రహం బాధ అట్లా చేసింది. ఆ గ్రహం వొదలగానే ఆమె తెలుసుకున్నది. అటువంటి పతివ్రతా, నిర్మల చరిత్రా, ఈ యుగంలో లేదు. తెలిసిందా?" అని యెవరికీ ఈ సంగతి చెప్పనని గొప్ప వాగ్దత్తం చేయించుకున్నాడు.

మర్నాటినించి నా భార్య అందరితోను నన్ను రత్నమ్మగారు కోరిందనీ, తనమీద ప్రేమచాత నేను ఆమెను నిరాకరించాననీ, ఆ వ్యధతో కాల్చుకు చచ్చిపోయిందనీ పుకారు పుట్టించింది. మమ్మల్నిద్దరినీ రాత్రులు అనుమానంతో చూసిన యిరుగు పొరుగువాళ్ళు నిజమే నన్నారు. ఇంక వూరంతా పాకిపోయింది. గోడలమీద 'హెడ్మాష్టరుగారి భార్య యెందుకు పోయింది?' అని రాశారు. నేను నా పనికి రాజీనామా యివ్వడం, నేనూ హెడ్మాష్టరుగారూ మాట్లాడకపోవడం రూఢి పరిచాయి. ఆ వార్తని.

హెడ్మాష్టరు విషం మింగి చచ్చిపోయినాడు.

పతివ్రతాతిలకం నా భార్యా, జగన్మోహనాకారుణ్ణి నేనూ, మిగిలాం.

* * *

# అమ్మగారి అవసరం

మూడురోజులు యెడతెరిపి లేక కారుమబ్బులు వేసి, ఏకధారగా వర్షం కురిసి, ఆ సాయంత్రమే చీకటి పడేముందు వెలిసింది. భోజనంచేసి డిప్టీసూపరెంటు నరసింగరావు బంగాళా వరండాలో నుంచుంటే జలప్రళయం మధ్య మా చిన్న తోటా మేడా తేలుతున్నట్లుగా వుంది. ఆ చలిలో కప్పలు బూజంబంతిపాటలు పాడుతున్నాయి. మా సిగరెట్ల పొగచలిలో చీకట్లో బైటికి పోవడానికి వెరిచి మా చుట్టుప్రక్కనే వేళ్ళాడుతోంది. నా కట్లాంటి కథల్లో సరదా పోలేదని తెలిసిన నరసింగరావు, ఆ వూళ్ళో గొప్పవర్తకుడి భార్య ఒకనాడు చప్పున వాళ్ళ వకీలింటికి లేచి పోయి మళ్ళీ రానన్న సంగతీ, ఆ వకీలు తన తప్పు లేదని ఆ వర్తకుడి కాళ్ళు పట్టుకోడమూ చెపుతున్నాడు. ఇంతలో జవానొకడువచ్చి శాల్యూట్ చేసి నుంచున్నాడు. "యేం, భవానీసింగ్, ఇవాళంతా మళ్ళీ యెగేశావు కదూ?" అన్నాడు నరసింగరావు.

"పనివుండి రాలేదు." అన్నాడు జవాను నిర్లక్ష్యంగా.

"ఇదే ఆఖరిసారి నీకు చెప్పడం. యీసారి."

"నాకు బదిలీ చేయించండి."

"బదిలీ కాదు, డిస్మిసు చేయించండి, అను."

"డిస్మిసే! చేయించండి, తెలుస్తుంది."

"సరేలే, వెళ్ళు వెధవ బెదిరింపులు."

"సంగతులు బైటికి రావా?"

"ముందు నడు" అని నరసింగరావు లేచి వాణ్ని తన్నబోయినాడు. ఆ జవాను కళ్ళు చూస్తే, నరసింగరావుమీద ద్వేషంతో నిండి మెరుస్తున్నాయి. వెంటనే బొడ్డులోంచి కత్తితీసి, పొడవడు కదా అని నాకు భయమేసింది. నే నడ్డపడి, వాణ్ణి పొమ్మన్నాను. వాడు పోయింత తరువాత సగం సిగరెట్టు కాల్చి చప్పున నరసింగరావిట్లా అన్నాడు.

"చూశావా, నా ముందు లేడూ గోపాలయ్యర్ వాడు వీణ్ణిట్లా చెడగొట్టాడు వెధవ జవానుగాణ్ణి! అదోచిత్రమైన, కథ, ఈ లోకంలో యెన్ని తమాషాలనీ! బయటికి చెప్పామా అన్నీ అబద్ధాలంటారు ప్రతిష్ట కోసం! నీ కథలెందుకు. వాస్తవం ముందు

ఆర్నెల్ల క్రిందట గావును, విజయనగరంనించి యీ వూరు సాక్ష్యానికి వొచ్చి యితని యింట్లో-అంటే యీ బంగళాలోనే, గోపాలయ్యర్ గెస్టుగా దిగాను, సరిగా యిట్టాంటిరాత్రి భోజనంచేసి ఆ పక్కగా కూర్చున్నాము, డిపార్టుమెంటు కబుర్లు చెప్పుకుంటో చక్కని యెండా కాలపు గాలి నా కళ్ళకు నిద్రని తెచ్చింది. పడుకుంటావా అని నన్నడిగి, యీ భవానిసింగుని యింటికి పొమ్మన్నాడు. కాని మూడుసార్లు చెప్పినా వీడు కదలకపోవడం నా కాశ్చర్యం వేసింది. ఏదో వంటరిగా గోపాలయ్యర్‌తో వాడు మాట్లాడాలి గావుననుకుని లేచాను. అయ్యర్ నాతో లాంతరు తీసుకొచ్చి దక్షిణపువేపు గది లేదూ మేడమీద ఈ రాత్రి నువ్వు దాంటోనే పడుకుంటావు-దాంటో విడిచి కిందికి వొచ్చాడు. నేను సిగరెట్టు అవతల పారేసి, సంచీలోనించి నవల తీశాను. కాని కిటికీలోంచి బయటికి చూస్తే చుట్టూ అందమైన చీకటి, చీకటికంటె నల్లగా తుమ్మచెట్లు పూగుతున్నాయి. చీకటి కాంతి నీళ్ళమీద కొంచెంగా ప్రతిఫలించడంవల్ల నీళ్ళు మెరుస్తున్నాయి. అంత వానకికూడా ఆరని నీలపు దీపాల్ని మోసుకుంటో మిణుగురు పురుగులు ఆకుల్లో వుత్సవం చేసుకుంటున్నాయి. మబ్బులు దెయ్యాలవలె ఎగిరి పోతున్నాయి ఆకాశంమీద. అట్లానే కిటికీదగ్గర ఆగి పోయి, చూస్తోకూచున్నాను. మళ్ళీ సిగరెట్ వెలిగించి పక్కతలుపులోంచి జాజి పువ్వుల పరిమళం తగిలింది. తలతిప్పి చూశాను. పద్దెనిమిదేళ్ళ అమ్మాయి సిగ్గుపడుతో నడిచివొచ్చి నావంకనైనా చూడక తలవొంచుకుని, నా ముందు నుంచుంది. యేం చెప్పను? ఈ నాటికి కూడా ఆ క్షణాల అనుభవం నన్ను విడువలేదు. ఏనాటి రాత్రి అట్లా మళ్ళా వొణుకుతున్న వేళ్ళతో నడిచివొచ్చి దీనంగా నాముందు నుంచుంటుందో అనుకుంటాను. ఆమె యీ మేడను ఆశ్రయించిన యే గృహదేవతో అనిపించింది. గదంతా ఆమె తల్లోని జాజిపువ్వుల వాసనతో నింపింది. ఆమె వొంటికి రాసుకున్న జవ్వాజి గంధం నన్నులుముకుంది. అట్లా పరిమళాల్ని ఉపయోగించే తెలుగువాళ్ళని చూపించు, ఒక్క పరిమళమేమిటి ఆ చేతుల గట్టితనమూ, నడుమువొంపూ, ఆ పొడుగులోని నవనవా, ఆ చెక్కిళ్ళ కోలతనమూ, కళ్ళలోబెదరూ, పువ్వుల్లోని వాసనలాగు కనపడి దాక్కునే సిగ్గూ, అన్నీ అరవజాతి లావణ్యాలే. నా మనసు వూటలూరింది.

"ఎవరు?"

తలెత్తింది. గోపాలయ్యరు భార్య! చప్పున లేచాను.

"ఎందుకు వొచ్చావమ్మా?"

మెల్లిగా కాటికరెప్పల్ని యెత్తి మళ్ళా వాల్చింది. పశువుకి, నపుంసకుడికి, పసిపిల్ల వాడికి అర్థమౌతుంది, ఆ చూపు,నాకా! నా వొళ్ళంతా ఆ వొక్క చూపు నా



నరాల తంతులమీద గాడమైన సంగీతం పాడింది. గోపాలయ్యరూ స్నేహమూ యేమీజ్ఞాపకంలేదు. ఈ అదృష్టం, నిజమేనా, కలకాదు గద! యేం చెయ్యను? ఎందుకు వొస్తుంది? అంత సాహసమా? కనుక్కోరా?

"ఎందుకు?" అన్నాను.

మళ్ళా చూచింది, యీసారి కళ్ళ పక్కలనించి, నన్ను చూసింది. హృదయం సంతోషిస్తోందనీ, ఆశిస్తోందనీ, ఎంతో గర్వం వచ్చింది. కాని అయ్యర్ కనుక్కుంటే! తలుపు గడియన్నాలేదు. మళ్ళా తలుపు తెరుస్తున్నారు, ఎవరో! "నే నేమెరగను తీసుకెళ్ళ"మని అనాలనుకున్నాను, కాని నమ్ముతాడా? అని భయమేసింది. ఇదో అల్లరాఇక్కడ! నన్ను నమ్మివచ్చిన పిల్ల నన్యాయం చేస్తున్నాననే ఆలోచనేలేదు. కాని ఆమె ముఖం నిశ్చలంగానే వుంది. వాళ్ళ ముసలమ్మ లోపలికి వొచ్చి వెండిచెంబూ, పళ్ళెంలో మిటాయీ, పళ్ళూ పెట్టిపోయింది. అమ్మాయి అట్లానే నుంచునివుంది. ఈ ముసలమ్మా యీ పిల్లా కలిసిచేసిన ఆలోచనా?

"గోపాలయ్యరికి తెలుసునా?"

తల వూయించింది. ఇదేదో కొత్త మర్యాదగా వుందే!

"రా, యిట్లా కూచో"

"మీరుకూడా కూచోండి"

ఇద్దరమూ పక్కగా కూచున్నాము. ఆమె చేతిని నా చేతితో పట్టుకున్నాను. తృప్తితో కూడిన చిన్న నవ్వు నవ్వింది, ఆ తాంబూలం పెదిమల చివర్లనించి. నా ప్రిన్సిపిల్సు నీకు తెలుసుకదా? ఎంత స్వేచ్ఛగా విహరించినా, స్నేహితుల యిళ్ళల్లో కళ్ళెత్తడం నాకు మనస్కరించదు. అరగంట ముందువరకూ ఆతురతతో కబుర్లుచెప్పి, యిప్పుడు మిత్రుడు గోపాలయ్యర్ సంసారాన్ని యిట్లా పాడుచెయ్యడం, నాకు మనస్కరించలేదు. కాని అతనికి తెలీకుండా రావడం అసంభవం కదా? నా అనుమానం గ్రహించిందో యేమో బిక్కపోయి నా ముఖం వెతికే, ఆ చిన్న కోల ముఖమూ, ఆ పల్చని చిన్న పెదిమలూ చూసేటప్పటికి నా సందేహాలు మాయమైనాయి. "మీ కోసం" అంది, ఎంత ఆకలిగా వుంటే, ఆ మాటలు ఆ ముగ్ధ సిగ్గుతో వాలిపొయ్యే పెదవుల్లోంచి ఆనకలిగిందో అనుకుని.... మధ్య రాత్రి మెలుకువ వొచ్చింది. ఎవరో గదివెనక తలుపు పైకి యెగ బాకుతున్నట్లు చప్పుడయింది. నా చేతిమీదా, మెడమీదా, వున్న మెత్తటి జుట్టుని మెల్లిగా తప్పించుకుని చూశాను. పైన వెంటిలేటరులోనించి రావాలని ప్రయత్నం కాదుగద! చప్పున లేచాను. రుక్మిణీ లేచింది. తలుపు తెరవబోతోవుంటే చప్పున చెయ్యి పట్టుకుని వెళ్ళవద్దంటుంది. ఎంత భయం లేదన్నా వినదు; గట్టిగా నన్ను పెనవేసుకుని, కళ్ళు వోరగా పెట్టి, ముద్దుగా, "నన్ను విడిచి

వెళ్ళవొద్దం"టో వుంటే యేంచెయ్యను? వూడిపోయే చీరె వూడకండా, నాకు నడుము నానించి, రెండుచేతులతో నా కంఠాన్ని కౌగలించుకుని పైకెత్తిన మొహాన్ని ముద్దుపెట్టుకోక, బైటికి పరిగెత్తనా! దొంగలైతే, వాళ్ళ పని తరవాత! "నన్ను చూడనీ ఒక్క నిమిషం."

"వొద్దు. ఎవరూలేరు?" అని బిగ్గిరిగా "ఎవరది? పో, బుద్ధిలేదూ?" అంది. ఆ చప్పుడాగింది. పళ్ళు పటపట కొరుకుతున్నాడా ఆ బైటమనిషని పించింది. గోపాలయ్యరికి ఆ గతియెందుకు? పెళ్ళాన్ని చూస్తే భయమా? రుక్మిణి మొహం చూశాను, ఛా, నమ్మకద్రోహం చేసేముఖమా అది; అనుకుంటోనే చక్కని నున్నని రొమ్ముమీద జాజిపువ్వుల, జవ్వాజి వాసనల్లో, రెండుచేతులమధ్య నిద్రపోయినాను.

తెల్లారి కళ్ళు తెరిచేటప్పటికి రుక్మిణి తల నద్దుకుని, చీర సరిగా కట్టుకుని, నా వంక నవ్వుతో చూస్తో కూచుని వుంది. ముఖం ఆనందంతో సంతుష్టితో కలకలలాడుతుంది. నా ప్రజ్ఞకి నాకు గర్వంగా వుంది. వింత కాంతితో కళ్ళు మెరుస్తున్నాయి. కొత్త కోర్కెతో చేతులుజాచి తలను మీదకి లాక్కున్నాను.

"వొద్దు, మళ్ళీ రాత్రి." అన్నది. "నేను వెడుతున్నాగా యివాళ" అన్నాను, దిగులుగా. "వొద్దు" అన్నది.

"వెళ్ళాలి"

"వొద్దు"

వొద్దు అన్నప్పటి నన్ను కట్టేసే చూపు, ఆ చిన్నతలవూపు, వేళ్ళ బెదురు, అన్నీ చూసి యీమనసు! కాని యెట్లా వుండడం?

"యేమని చెప్పి వుండను? నా పని ఐపోతుంది"

"నాతోనే మీపని, నేను చెపుతాగా! సరేనా!" అని చప్పున వెళ్ళి పోయింది. మళ్ళీ చప్పునే వొచ్చి "పర్సు యేదీ"

అని, నా జేబులు తడిమి, పర్సుతీసి," యీ ఐదురూపాయలు చాలునా యివాళ్టి ఖర్చుకి? సరే అని ఒకనోటు నాకిచ్చి పర్సు తీసుకుని వెళ్ళిపోయింది.

అట్లాగే పడుకుని ఆలోచించుకున్నాను. ఈ గోపాలయ్యర్‌కి నాతో డిపార్టుమెంటు పనిలేదు. లేక డబ్బు సంపాదించే వ్యాపారమా? నా పర్సు తీసుకోవడం అదే వుద్దేశ్యమేమో; కాని రుక్మిణి చేస్తుందా అట్లాంటిపని! చెయ్యదు. లేచాను, కిందికివెళ్ళి గోపాలయ్యర్ని చూడడమంటే సిగ్గేసింది. కానీ కాఫీ దగ్గర అతను యేమీ జరగనట్టే మామూలుగానే మాట్లాడాడు. రుక్మిణి నన్ను చూసి యెప్పటిమల్లేనే, సహజంగా సిగ్గుపడి మాయమౌతోంది.



ఆనాడు కోర్టులో యిన్స్‌పెక్టరు శంకర్రావు కనపడ్డాడు. వాడూ నేనూ చిన్నప్పటి స్నేహితులం. "బసెక్కడ?" అన్నాడు.

"గోపాలయ్యర్‌తో"

"సరే, యింకేం? అన్నీ సలక్షణంగా జరుగుతున్నా యన్నమాట! అసాధ్యుడివి!' అని నవ్వుతో భుజంమీద తట్టాడు. నేను కోపం మొహం పెట్టి "అంటే?" అన్నాను.

"బూకరించకు, తెలీంది యేమీలేదు." అని వెళ్ళిపోయినాడు.

నాకు మరీ ఆశ్చర్యమేసింది. ఇది తప్పకుండా డబ్బులాగే వ్యవహారమే!! ఇక యీ రాత్రి వొస్తుందా! డబ్బంతా లాగిం తరవాత! కాని రుక్మిణి చూపు, వెళ్ళవద్దని బతిమాలుకోడం! నేను నమ్మలేకపోయినాను. కాని రుక్మిణిమీద అనుమానమూ అసహ్యమూ పొడచూపుతున్నాయి నా మనసులో.

ఆ రాత్రి నేను తోటముందు నుంచుని వుండగా యీ భవానీసింగు వొచ్చి, శల్యూటుచేసి, కోర్టులో మధ్యాన్నం పని అయిపోయిందికదా?" అన్నాడు.

"ఏమిటి?" అన్నాను.

"మీరు వొచ్చిన పని."

"ఐతే?"

"యింకా వెళ్ళలేదేం?"

వీడేమన్నా మూఢుడా! పిచ్చివాడా?- "నీ కెందుకు?"

"వెళ్లండి. అన్నాడు, బెదరింపు కంఠంతో. "గెట్ ఎవే" అని తన్నపోయినాను. వాడు వెడుతో "నా మాట విని వెళ్లండి" అన్నాడు.

మధ్య వీడెందుకు? వీడికేం తెలుసు? అని ఆలోచించాను. లాలన చేసి అడగవలసింది అనుకున్నాను. రాత్రి మళ్ళీ గోపాలయ్యర్ నన్ను గదిలో వొదిలాడు. రుక్మిణి కొర్నాటి చీరె సింగారించి వొచ్చింది. నేనా రాత్రి యేమనుభవించానో మాటలతో చెప్పతరంకాదు. ఇది మాత్రం నిశ్చయంగా చెప్పగలను, 'గ్రేస్'లో పడకగదుల్లో తెలుగు స్త్రీలు అరవ స్త్రీలతో, యేమాత్రమూ, యీడు రాలేదు. ఆ అభిప్రాయంమీదే అరవమ్మాయిని పెళ్ళిచేసుకుందామని వెతికాను, కాని వాళ్ళిస్తారా? 'యిట్లా లభించవలసినదే గాని! మతం తగలపడదూ? తెలవారకట్ట లేచినప్పుడు, నేనావాళ వూరికి వెడతానని ఆమెని నొప్పించాను, కష్టంమీద. రుక్మిణి ప్రేమలో నా అనుమానాలన్నీ కరిగిపోయినాయి; వాటి సంగతి తల పెట్టలేదు. తీక్షణమైన వూపిర్ల మధ్య సమస్య ఆలోచించడానికి వ్యవధి వుందా ! సౌందర్యం గుర్తించి అనుభవించడం చేతగాని దౌర్భాగ్యులకదంతా! నీకూ, నాకూనా!

కాని రుక్మిణి వెళ్ళగానే నా సందేహాలన్నీ వొచ్చాయి. డబ్బు కాజేసిందికద. ఈ రెండు రాత్రులకు వక వందా యిరవై మూడు రూపాయలా! కాని యెన్ని లక్షలున్నా నిర్లక్ష్యంగా యివ్వనా, నేను! కాని ఆ ప్రేమ చూపడం అంతా డబ్బుకోసం అనేనా! అంత మోసపోయినందుకు నామీద నాకే అసహ్యం వేసింది. యింటికి వెళ్ళడమెట్లా గోపాలయ్యర్ని అప్పు అడగాలా!

మధ్యాహ్నం కోర్టుకి వెడుతో జేబులో చెయ్యిపెడితే పర్సు. ఎక్కడిది? దొంగ రాత్రి యెప్పుడో పెట్టింది. తెరిచాను! దాంటోంచి యిన్ని జాజిపువ్వులు రాలాయి. రూపాయలకి బదులు! జాజిపువ్వులు నూటయిరవై మూడురూపాయల ఖరీదా! లోపల యింకా యేమో వున్నాయి! రూపాయలన్నీ వున్నాయి, పైగా ఒక వుంగరం! ఆ రుక్మిణి మీద పడ్డ అనుమానానికి నన్ను నేను తన్ను కోవాలనిపించింది. ఇంతకీ సమస్యయేమీ అంతం కాలేదు. ఈ సంగతేదో తెలుసుకున్నదాకా వుండలేను. రుక్మిణిని రాత్రి ప్రశ్నిద్దామంటే నోరు రాలేదు, కొంచెంగా మొదలు పెట్టినప్పుడల్లా, పెదిమలతో, తాంబూలం వాసనలతో, అడ్డం పెట్టింది. శంకర్రావుని పట్టుకుని అడిగాను. జరిగినదంతా ముందు నా దగ్గిర్నించి లాగాడు. అతనూ పోలీసు వాడయ్యెను.

"తెలీటంలా! గోపాలయ్యరు ముసలివాడు, ఎవరన్నా పెద్దమనుషు లొస్తే భార్యని పంపుతాడు వాళ్ళ గదిలోకి.

"ఎందుకు?"

"ఏం చేస్తాడు?"

"మరెందుకు పెళ్ళిచేసుకున్నాడు?"

"ఏమో, యే తల్లి బాధో పడలేకపోయి వుంటాడు."

"వెధవ"

"లేదు, నాకతన్ని చూస్తే చాలా గౌరవంగా వుంది."

"అవును భార్య అవుసరం గుర్తించే భర్తని వేలెత్తిచూపు."

"సరేలే, ఆ భవానీసింగ్."

"యింకేముందీ! యింకెవరూ దొరక్కపోతే, పదిగంటలప్పుడు 'భవానీసింగ్ అమ్మగారి అవసరంచూడు' అంటాడు. అందుకనే ఎవరు వచ్చినా కరుస్తాడు, ఆ జవానుగాడు."

* * *

# అవసరంలేని ఆపరేషన్

"ఆ బాణసంచా ఆడావిడి యేమిటి?"

"టీ పార్టీ"

"యెవరికి?"

"యివూరు ఆడ డాక్టరికి బదిలీ అయింది"

"యింత ఆడావిడా?"

"యీ వూరిప్రజలకి ఆమెని చూస్తే అత్యంతాభిమానం"

"యెందుకో?"

"ఐదేళ్లలోనూ వాళ్ళవి పదివేలరూపాయలు బ్యాంకిలో వేసుకుంది. అందుకని.

"అంత తెలివిగలదా?"

"అనేమో! మొదటి సంవత్సరం ఆమె మొహం చూసినవాడు లేడు. కాని ఆ జూలైలో గావును ఒక విచిత్రమైన కేసు కుదిర్చింది. దాంతో ఆమె ప్రభ అద్వితీయంగా వెలిగింది, యీ నాలుగేళ్ళూ"

"యేం కేసేమిటి?"

"అదే తమాషా, అందులో ఈమె ప్రయోజకత్వ యేమీలేదు. కీర్తి మాత్రం యీమెకి దక్కింది. వాళ్ళు మాకు బంధువులే. చెప్పనా? ఆమెకి ముప్పైయేళ్ళు-"

"డాక్టరుకా?"

"కాదు. మా బంధువురా లొకామెకి. ఆమెకి పిల్లలు లేరు. పిల్లలు లేకపోతే బతకడమెందుకనే మనోవ్యాధి పట్టుకుందామెకి. యింక బిడ్డల కోసం వాళ్ళుపడ్డ శ్రమా, చేసిన ప్రయత్నాలూ యిన్నన్నికాదు. యెన్ని మందులో, యెన్ని యాత్రలో, యెన్ని విధాలైన ప్రదక్షిణాలో, యెంతమంది బైరాగులకీ, సన్యాసులకీ బహుమతులో! యేమీ లాభంలేక, విసుగెత్తి రోజూ ప్రతివారితో తన కథ చెప్పుకుని యేడుస్తో పడివుంది. చిన్నదాని వింకా నీకింతతొందరేమిటి, నిరాశ యేమిటంటే వినదు. చివరికి ఒక

పిల్లాణ్ణితెచ్చి పెంచుకుంటే, వాడు యీామె ముద్దులు భరించలేక పారిపోయినా
తరవాత చెన్నపట్నం నుంచి పెద్ద బొమ్మ నొకదాన్ని తెచ్చుకుంది. ఆ బొమ్మకి పాలి
ముద్దాడీ, నీళ్ళుపోసీ చొక్కాలు తొడిగీ, అది చేతులూ కాళ్ళాడించాలనీ, యేడవాల
మాట్లాడాలనీ, ఆమెచేసే ప్రయత్నం, చూస్తే అందరికీ అమితమైన జాలి కలిగే
మా బంధువుల్లో పిల్లలులేని దరిద్రులెవరూలేరు కనుక యీామె సిగ్గుపడి, పిల్లలులే
పాపం చేసినట్లు యే కార్యాలకీ యెక్కడకీ వెళ్ళడం మానేసింది. యెవరు తన ఇంటి
వచ్చినా, వాళ్ళు తనని హేళనచేస్తున్నారే అనుకుంది. పిల్లలకోసం యీామె చెయ్యడాని
నిరాకరించే పనివుందా అనిపించేది. యింతలో ఆ వూరొక స్వాములార్ల మీది గొప్ప
స్వాములవారు వొచ్చారు. గొడ్రాళ్ళకి పిల్లలు పుట్టించడంలో ఆయన బహునేర్పరి
గుంపులు గుంపులుగా ఆడవాళ్ళాయన్ని దర్శించి కృతార్థు లౌతున్నారు. ఒక్క
వితంతువులు మాత్రం, ఆయన గాలి తగిలితే, తమకే వుపద్రవం కలుగుతుంద
అని దూరాన తప్పుకొంటున్నారు. సరే యీామె ఆయన దర్శనానికి వెళ్ళింది. పదిహే
రోజులలో గర్భిణీ చిన్నాలు కనపడ్డాయి. వేవిళ్ళు మొదలైన సంగతులన్నీ సక్రమంగా
జరిగాయి. యింక వుత్సవాలేమిటి? సూడిదలూ, వొచ్చే బంధువులూ, పోయే
బంధువులూ, పదినెలలూ ఒకటే గొడవగా గడిచింది. పది నెలలూ దాటాయి; కనలేదు
సంవత్సరమయింది కడుపు అట్లానే వుంది. వాళ్ళకి బయమేసి యీా డాక్టరు దగ్గరి
తీసుకొచ్చి చూపారు. ఆమె పరీక్షచేసి అది కడుపుకాదని రూఢిగా చెప్పింది. ఆ మా
వినగానే పాపం యీా పిల్ల మూర్ఛపోయింది. బంధువులంతా గొల్లుమని యేడ్చారు
వారంరోజులు మందిచ్చేటప్పటికల్లా పొట్టకాస్తా కరిగిపోయింది. ఇట్లా పదినెల్ల గర్భిణీని
వారం రోజుల్లో మాయంచెయ్య శక్తి గలిగిన డాక్టరు తిరిగి దాన్ని నిజంగా రప్పించలేద
అనే గట్టి విశ్వాసం వాళ్ళకు కుదిరింది. ఆమె తనకి చాతకాదు, పొమ్మన్నావాళ్ళు
కదలలేదు. ఒకరోజు రాత్రి యీామె పోయి డాక్టరు కాళ్ళమీదపడి బతిమాలుకుని
తనకి సంతానం కలిగిస్తే పదిహేను వందల కాసులపేరు యిచ్చేస్తానంది.

ఈ డాక్టరు భర్త బి.య్యే. పాసై ఎండాకాలపు శలవలకి యీామె యింటో
వున్నారు. ఒకరోజు భార్య ఆస్పత్రికి వెళ్ళినప్పుడు యీా అమ్మాయివొస్తే నవ్వి చెయ్యి
పట్టుకుని దగ్గిరికి లాక్కున్నాడు. ఈ అమ్మాయి చాల పూర్వాచారపరాయణురాలు,
దైవభక్తిలో, భర్తసేవలో, పెరిగిన మనిషి, పరపురుషుల ధ్యానం యింతవర కెరగదు.
అట్లాంటిది బలవంతంగా తటస్థించినా చాల ఘోరపాపమని జంకుతుంది. అతనిపైని
గౌరవంచాతా, భయంచాతా, యేం అనకపోయినా అతన్నించి తప్పించుకుని,
ఒక్కమాట మాట్లాడకండా వెళ్ళిపోయింది. మళ్ళీ వొంటరిగా ఆ యింటికి వెళ్ళలేదు.
కాని అతనికి మాత్రం ఈమెమీది మమకారం యే మాత్రమూ వదలలేదు.

మర్నాడు ఆపరేషన్ నిశ్చయమైంది. ఆ సాయంత్రం ఆ అమ్మాయి భయంతో
డాక్టరింటో యేడుస్తో కూచుంది. తన భార్య పక్కగదిలోకి వెళ్ళినప్పుడు ఈమెతో "వూరో



యేడవకు - ఈ డాక్టర్ల కేం తెలుసు - ఈ ఆపరేషన్ లేకుండా అనేక మందులున్నాయి - మళయాళంలో కాశ్మీరంలో అనేక క్రియలున్నాయి- అవి నాకు తెలుసు- డాక్టరాస్పత్రికి వెళ్ళేం తరవాత రా చెపుతాను" అన్నాడతను - ముందు వేళాకోళ మనుకుంది. కాని ఆలోచించగా, ఒకవేళ అతనికేదన్నా మంత్రం తెలిసివుండకూడదా అని తట్టింది. ఆపరేషనంటే ఆమెకున్న మహాభయమూ, బిడ్డమీద ఆపేక్షా ఆమె విశ్వాసాన్ని మరింత బలపరిచాయి ఇంటికివెళ్ళి భర్తతో చెపితే, తప్పకుండా వెళ్ళి కనుక్కోమన్నాడు- ఆమె రాగానే, డాక్టరు భర్త కూచోపెట్టి ఈ సంగతులు మాట్లాడాడు.

"ఈ పిల్లలు పుట్టుకపోవడము, నీ లోపమూ కాదు, నీ పూర్వజన్మ లోపమూ కాదు. దేవుడికి నీమీద ఆగ్రహమూ కాదు- లోకంలో గడ్డి పరకలకి వెయ్యిగింజలూ, ఈగలకి లక్షగుడ్లూ ప్రసాదించే ఈశ్వరుడు నిన్ను గొడ్రాలి చెయ్యాలని వుద్దేశ్యపడతాడా ? లోకమంతా జననీ ప్రేమతో మోగిపోతూవుంటే "బిడ్డో!" అని యేడ్చే నీకు బిడ్డలు లేక పోవడమేమిటి? పోనీ, నీ దేహంలో రుగ్మతవుందా? యే మూలాలేదు. కోపం తెచ్చుకోకు, లోపమంతా నీ భర్తది. ఆయన వంశంలో పిల్లలుక్కువమంది వుండరు-అవునా?"

"మరి ఆయనకి ఆపరేషన్ చెయ్యాలా?"

"లాభం లేదు."

"ఐతే యెట్లా ?"

"యెట్లానూ లేదు"

"ఏదో చెపుతామన్నారు, మరి !"

"మరి చెపితే కోపం తెచ్చుకోవుకద!"

"చెప్పండి"

"నీకు ఆవు వుందనుకో, దానికి దూడ కావాలి. ఒక యెద్దుదగ్గిర యెదకాకపోతే ఏంచేస్తారు?" సిగ్గుతో మాట్లాడలేదు.

"చెప్పమరి! యింకో యెద్దు దగ్గిరికి తోల్తారు అంతే."

మాట్లాడకండా కూర్చుంది స్తంభించిపోయి.

"నేను చెప్పేమాట విను. నీకు పిల్లలంటే వెర్రి. పిల్లలులేకుండా బతకలేవు. గంపెడు పిల్లల్ని కడుపారా కనేందుకు నిన్నూ నీ శరీరాన్నీ, నీ మాతృ హృదయాన్నీ సృష్టి ఏర్పరచింది. అందుకే యీా బాధ. నీకు పిల్లలూ, వారిమీద ప్రేమా, స్త్రీకి జన్మహక్కు; సహజం. అవే స్త్రీ జీవితానికి మకుటాలు. అవిలేక జీవితం శుష్కం, అర్థవిహీనం. అందుకునే, యెంత అణచుకుందామని ప్రయత్నించినా అణగని ఆ బాధ నీకు. యింక ముందు యికా బాధపడతావు. ఈ యాత్రలూ, మంత్రాలూ, ఆపరేషన్లూ యేంలాభం ? ఆయన్ని మార్చవుకదా ?"

"ఆయనకేమీ జబ్బులేదే ?"

"లేదు. కాని యిదే జబ్బు."

"యేది ?"

"నీకూ ఆయనకీ జత కుదరలేదు."

"ఐతే."

"జత కుదుర్చుకోవాలి."

"అంటే ?"

"వేరే పెళ్ళిచేసుకోవాలి"

"ఆయన చేసుకునేంలాభం ?"

"ఆయనకాదు నువ్వు-"

"నేనా ? పెళ్ళా ?"

"పెళ్ళంటే పల్లకీలో వూరేగడం కాదు. యింకోభర్తని బిడ్డలకోసం మాత్ర... మధ్యనే "పాండి" అని లేచింది.

"ఆ కోపమే వొద్దన్నాను. బిడ్డల్ని యెత్తుకోకండా, ఆడించకండా వాళ్ళ ముద్దు... చూడకండా వుండగలవా ? వెళ్ళకు. ఒక్కమాట విను. మా అబ్బాయిని చూశావు... అట్లాంటివాడు పుడితే ! మేము సంతానాలకి ప్రసిద్ధి. మా గాలి సోకితే చాలు. మే... పన్నెండుగురం మా తల్లికి. మాలో ఒక్కొక్కరికి నలుగురు పిల్లలకన్న తక్కువలేరు.

వెళ్ళిపోయి, రాత్రంతా ఆలోచించుకుంది. మర్నాడు సాయింత్రం డాక్ట... భర్త టెన్నిసుకి వెడుతో వుండగా, ఆమె గుమ్మంలో సిగ్గుతో ఎదురయ్యింది. ... సాయింత్రానికి ఆమెతో ఇంటోనే వుండిపోయినాడు....

ఆమె ఆపరేషన్ మానేసి తన వూరు వెళ్ళింది, మూడురోజుల తరువాత. యేడాది తరవాత చక్కని పాపాయి నెత్తుకుని వొచ్చింది, డాక్టరు దగ్గిరికి-ఆ అమ్మాయి భర్త చాల సంతోషంతో, గర్వంగా - "అపరేషన్లన్నారు. ఒక వంద వొదిలేవి! యేమి లేకండానే యెట్లాంటి పిల్లవాడు కలిగాడో? ఈశ్వరుడి దయవుంటే యేమన్నా జరుగుతుంది" అన్నాడు.

డాక్టరు, భర్తని పిలిచింది. "చిన్నప్పుడు మన పెద్దబ్బాయి అచ్చు యిట్లాగే వుండే వాడుకదూ ?" అంది.

డాక్టరుకి ఆ అమ్మాయి భర్త ఒక చీర యిచ్చాడు. డాక్టరు భర్తకి బంగారు వాచీ గొలుసూ యిచ్చింది, ఆ అమ్మాయి. అప్పణ్ణించి ఈమె కీర్తి దివ్యంగా వెలిగింది.

★ ★ ★

# అవతారమా ?

పంచానన తీర్థులు స్ఫురద్రూపి. మంత్రబలమూ, పరమార్థ జ్ఞానమూ, శాస్త్ర పాండిత్యమూ, వున్న మనిషివలె కనబడతాడు. తాటిపర్తికి ఎక్కణ్ణించి వచ్చాడో తెలీదు. ఆవూరి మహాదాత, స్తితిపరుడు, రావు చంద్రరావుగారు యీయన్ని రైల్లో కలుసుకొని, ఆయన సంభాషణకీ ప్రజ్ఞకీ సంతోషించి తన యింటికి ఆహ్వానించాడు. తీర్థులుగారి శక్తివల్ల రామచంద్రరావు గారికి లేక లేక చక్కని కొడుకు పుట్టాడు. ఆయన వదినగారు ఏదో మంత్రోపదేశమయింది. ఆయన మేనల్లుడి క్షయ కుదిరింది. ఆయన అన్న కొడుకు బ్రహ్మసమాజం వొదిలాడు. ఇదిగాక వూళ్ళో అనేకమంది ఆయనవల్ల అనేక వుపకారాల్ని పొందారు. దెయ్యాలు పట్టినవాళ్ళకి నయం చేశాడు. కొందరికి శని, దారిద్ర్యం వొదిలించాడు. దేవీ వుపాసన, అర్ధరాత్రులు కుంకుమపూజ, బ్రాహ్మణ సంతర్పణ, నిరంతర వేదాధ్యయనం, జరుగుతూ వుంటాయి ఆ ఇంటో. మొత్తానికి యీయన మూలాన వూరు మేలుకుంది, మధ్యాన్నం పురాణం చెప్పడం, భగవద్గీతలు ఉపన్యసించడం. సూర్యనమస్కారాలు చేయించడంవల్ల అందరికీ పొద్దుపోతోంది. ఆ వూళ్ళోనే, ఆ ఇంట్లోనే స్థిరపడ్డాడు. ఏ వ్యాధివచ్చినా, అమ్మవారొచ్చినా, వానలు లేకపోయినా జపాలుచేసి నయంజేసేవాడు. అందరిమీదా దయ. ఒక్క దురభ్యాసం, దుర్గుణం లేదు ఆయనలో.

అందరికీ, ఆయనమీద అమితమైనభక్తి, ప్రేమ. ముఖ్యంగా స్త్రీలకు, అందులో వితంతువులకి. మొగవాళ్ళకి ఆయన్ని చూస్తే అతిభయం ముఖ్యంగా వర్తకులకి, ఆయన్ని గురించి రహస్యంగానన్నాసరే తిరస్కారంగా మాట్లాట్టమన్నా అందరికీ భయం, రామచంద్రరావుగారిని బాకి అడగవచ్చిన బెంగుళూరి వర్తకులు తండ్రీ కొడుకుకూడా, ఎవరికీ అర్థంకాని జబ్బుతో, పదిహేనురోజుల్లో ఒకరి తరువాత ఒకరు చచ్చారు. ఆయన పూజలకి నూనె 'సప్లై' చేసే సుబ్బయ్య దబ్బిమ్మని అడిగిన వారంలో, కాలిమీద పుండులేచి నడవలేకపోయినాడు. పదిరోజుల్లో పెళ్ళాం తురకాడితో లేచిపోయింది. ఆ దెబ్బతో తీర్థులు ఆ వూరికి చక్రవర్తి ఐనాడు. అడక్కండానే అన్నీ తయారుగా యిస్తారు. ధాన్యం, పాలు, బట్టలు, అన్నీ !

తీర్థులు కాబట్టి సరిపోయింది గాని, యింకొకరే ఐతే, యీ ఆడవాళ్లు మధ్యాహ్నం మొదలు, రాత్రిదాకా ఆ యింటోనూ, గుళ్ళోనూ వుండడమూ వొచ్చేవాళ్ళూ పొయ్యేవాళ్ళూ,

పూజలకీ, భజనలకీ, సహాయం చేసేవాళ్ళూ ఆయనకి వుపచారం చేసేవాళ్ళూ యిద పెద్ద 'స్కాండల్' ఐ వుండును, అనుమానా లెక్కువవును. కాని నోరెత్తడానికి, మనస నన్నా అనుమాన పడడానికి హడల్. ఇంటిదగ్గిర తిండి సరిగా దొరక్క అవస్థపడే మొగ నోరెత్తి ఏమీ అనలేరు భార్యల్ని. ఆ వూళ్ళో ప్రతి ఆడదీ, రోజుకొకసారన్నా తీర్థులు గా దర్శనం చేసుకు తీరుతుంది. ఎవరన్నా రాకపోయినారా, ఏం దుర్గమ్మగారు రాలేద అంటాడు. అంతే, అరగంటలో దుర్గమ్మగారు వొచ్చి పాదాలకు సాష్టాంగపడి, కారణ చెప్పు కుంటుంది. అట్లా వెలిగింది ఆయన ప్రభ. ఆయన 'తల్లీ' అంటే, 'దేవీ' అంటుందని పుకారు. ఆయన దేవిని తప్ప తక్కిన స్త్రీ లందర్నీ 'ఏమే' అంటాడు ఎవ అగ్రహించరు.

తీర్థులుగారి శిష్యకోటిలో ప్రముఖురాలు పున్నమ్మ. ఆమె సాత్వికురాల బాలవితంతువు. పదహారేళ్ళది, కలరాతో అవసానదశ యందున్న ఆమెకి గతియైన అన ప్రాణదానం చేశాడు తీర్థులు. పదోయేట వితంతువైనప్పణ్ణించి, ఆమె యవ్వన సౌందర్య యెటువంటి చిక్కుల్లోకి ఆమె నీడుస్తుందో అని భయపడి యోచించి, శ్రమపడి, ఆమె పురాణాల్లోనూ, గౌరీభక్తిలోనూ, పూజల్లో, సంస్కృత వేదాంతాల్లో పెంచారు. పున్నమ్మకి జీవి మీద యింకా విరక్తి కలగాలని తీర్థులదగ్గిరికి బోధనకై ప్రవేశపెట్టారు. తీర్థుల రూపవిలాసాల ధీరత్వమూ, శక్తి జ్ఞానాలు, ఔన్నత్యమూ, పున్నమ్మ లేత హృదయాన్ని దిగ్భ్రమనెత్తించా ఆమెది చిన్న శరీరం. ఆమె రంగూ, నల్లని పెద్ద జుట్టూ, రెవిక లేని పమిటలోంచి కన బిగువు బుజాలూ ఆమెకి చాలా అందాన్నిచ్చాయి. తాను చిన్నప్పణ్ణించి ఆరాధించే దైవ తీర్థుల్లో అవిర్భవించాడు పున్నమ్మకి. ఆయనకోసం ప్రాణమివ్వడం ఒక గొప్పకాదు ఆమెక ప్రొద్దున్నే వెళ్ళి దినమల్లా ఆయన సేవలో గడిపి, రాత్రి ఆయన పడుకుంటే గాని యింటికిరాద తీర్థులగారేం చేస్తున్నారని అడగడానికి గాని, ఆయన అనుగ్రహాన్ని సంపాయించడానికి గా ముందు పున్నమ్మ గారిని సమీపించాలి. ఎవరికీ వుపదేశించని రహస్య మంత్రాన్ని వేదాం రహస్యాన్ని ఆమెకి వుపదేశించాడని చెప్పుకుంటున్నారు ప్రజలు. పున్నమ్మ యిప్పు ఒక్కనిమిషం తావళం తిప్పడం మానదు. ఎప్పుడూ కళ్ళు ధ్యానంలో రెప్పలు వాల్చివుంటాయి వృధాగా ఒక్కమాట మాట్లాడదు. ప్రతినిమషమూ ఈశ్వరనామ ముచ్చరిస్తో వుంటుంది. అం చిన్నపిల్ల ముఖంలో ఆ దివ్యతేజం చూసి అందరికీ అద్భుతంగా వుంది. ఆమెమీద పూజ్యభా హెచ్చయింది.

ఒకరోజు యెండాకాలపు రాత్రి పున్నమ్మ తీర్థులకి కాళ్ళు పిసుకుతోంది అర్థరాత్రయింది ఎవరూ లేరు. గురువు కళ్ళు మూశాడు. ఇంక యింటి వెళ్ళొచ్చనుకుంటోంది పున్నమ్మ. తీర్థులు చప్పున వొణకడం ప్రారంభించారు. ఎన్నడూ జబ్బెరగని ఆయనకి యీ జబ్బేమని పున్నమ్మ చాలా భయపడ్డది. ఈ జాడ్యాలకూ, బాధలకు అతీతుడనుకుంది ఆయన.





"చలి, చలి, శాలువ కప్పు."

శాలువలేదు అక్కడ.

"ఏదో వొకటి కప్పు, తొరగా!"

తీసుకురావడానికి వెళ్ళబోతోంది.

"వెళ్ళకు. ఒక్క నిమిషం ఆగలేను కప్పు ఏదో ఒకటి."

"ఏంలేదు,"

"తొరగా."

"ఎవర్నన్నా పిలుస్తా."

"వొద్దు తొరగా."

"ఏం లేదు."

"నీ జుట్టు కప్పు."

దగ్గిరకు వెళ్ళింది. ముడి వూడదీసి ఆ పెద్దజుట్టును విదిలించి కప్పుకున్నాడు.

"హాయి! హాయి! అమ్మా బావుంది....బావుంది....ఇంకా....చలి.... అబ్బా....దగ్గిరికి.... ఇంకా దగ్గిరికి, నీ జుట్టులో నీవొంటో ఎంతవేడుందో! ఎంత చలి, ఎంత చలి, ఇంకా దగ్గిరిగా!"

పున్నమ్మకి ఆశ్చర్యంగా వుంది.

దగ్గిరికి లాక్కుంటున్నాడు. మెల్లిగా ఆమెనంతా ఆక్రమించుకుం టున్నాడు. వూరికే వొణుకుతాడు. పున్నమ్మ ఏ పురుషుణ్ణి అంత వరకు తాకలేదు. ఆమెకు స్పష్టంగా తెలీదు పురుష సంబంధమంటే ఏమిటో. ఆమె కసలు ఆ వాంఛ యెన్నడూ ప్రారంభించలేదు. కొంతసేపు చూసింది. తీర్థులచెయ్యి ఆ వొణుకులో ఇటూ అటూ ఆమె శరీరంలో కదులుతోంది. పున్నమ్మకి అది సహజంగా తోచలేదు. ఏ రోగానికీ అది చిన్నంగా కనపడదు. లేచి వెళ్ళిపోవాలని వుంది. అసహ్యం సహజంగా కలుగుతోంది. కాని అమితమైన భయం. కోపమొస్తే ఆయనకి తానేమౌతుంది? యేదేవతనో తనమీదికి పంపితే! శపిస్తే.

కొంచెం సేపుండి-"వెడతాను, యిక పచ్చడం తెస్తాను" అంది.

"ఊ, మాట్లాడకు నేను దేవిని. ఉగ్రస్వరూపిణిని. నీవు నా భక్తురాలివి. నిన్నావహిస్తున్నాను. నేనే నువ్వు, నువ్వే నేను. బిడ్డా, ఏమే- విను. నీ భక్తికి మెచ్చాను. నీలో ప్రవేశిస్తున్నాను. నా శక్తి నీలోపల ప్రవేశిస్తోంది. నా దివ్యశక్తి- నీ వొళ్ళంతా వొణుకుతుంది, గగుర్పొడుస్తుంది. చెప్పలేని ఆనందం కలుగుతుంది. నా దివ్యస్వరూపం నువ్వు చూడలేవు. కళ్ళు పోతాయి. మూసుకో కళ్ళుమూసుకో "

అబ్బా యిదేమిటి? ·యిట్లా చేస్తున్నాడు? వొళ్ళంతా నీచమైపోతోంది. తన
ఊపిరాడకుండా అదుముతున్నాడు.

"వుండండి-స్వామీ-నన్వొదలండి."

"స్వామి ఎవరు? మాట్లాడకు. చచ్చిపోతావు. పాపం! భస్మమై పోతావు. కదలక
అయిపోయింది. వుండు-నేను ఈశ్వరిని. నా జ్యోతి నీలో ప్రవేశించింది. ధన్యురాలవై నావు."

కళ్లు మూసుకుంది. అతని వూపిరి అతితీక్ష్ణంగా ఆమె మొహానికి తగులుతోంది
"ఏం జరిగినా, ఏమైనాసరే కదలకు. కదిలావా. తల సహస్ర... నేను మంత్రస్వరూపిణివి
మహామంత్రంలో వున్నాను."

ఆమె కదలలేదు.

తెల్లవారికట్ట మూడింటిదాకా చలి ఆగలేదు, తీర్థులకి.

రెండు నెల్లయింది.

ఒకనాడు మధ్యాహ్నం పున్నమ్మ శిరసువంచి భక్తితో "నాకు మందు కావాలి"
అంది సమ్రతగా.

"ఎందుకు?"

"ప్రొద్దున్నే వాంతులుగా వున్నాయి"

"ఒహో! సరే నయం చేస్తాను"

ఆనాటినుంచి ప్రతిదినమూ తీర్థులు ఏదో గొప్ప గొప్ప మందులు తయారుచేసి యిచ్చాడు-కాని దోకులు మాత్రం కట్టనేలేదు. "ఈ మందుతో ఇల్లాంటి దోకులు ఎన్నో కట్టించాను. కాని నీ దేహం చాలా విచిత్రంగా వుంది. ఇక లాభంలేదు. ఇవి కట్టే దోకులు కావు. మంత్రమో తంత్రమో ప్రయోగించాలి" అన్నాడు.

మూడునెల్లయింది. పున్నమ్మ కళ్ళు ఇంకా అంతర్ముఖములైనాయి. ఆమె చెంపలు ఇంకా పాలిపోయినాయి. ఆమె మాటలు ఇంకా తక్కువైనాయి. ఆమె సేవలు ఇంకా ప్రొద్దుపోతున్నాయి.

తీర్థులు ఆ వర్షాకాలం యజ్ఞం మొదలుపెట్టాడు. అగ్ని గుండము ముందు ఆయన కూర్చొని వున్నాడు. వందమంది. బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు. పున్నమ్మ సామగ్రులు అందిస్తోంది. ఊరంతా ఆహ్వానింపబడ్డారు. తీర్థులు లేచి ఇట్లా మాట్లాడాడు. "ఒక గొప్ప విశేషం ఈ దేశానికి. ఈ దేశానికే కాదు, లోకానికంతా మంగళకరమైన వార్త నేను నీకు చెప్పబోతున్నాను. ఈ తాటిపర్రు ఈశ్వరుడిచేత అనుగ్రహింపబడ్డది. ఈ ప్రజలందరూ ధన్యులు. ఇంత పుణ్యక్షేత్రం కావడంచేతనే ఈశ్వరుడు నన్నిక్కడికి పంపినట్టున్నాడు. ఈ వూరి నామం యింకా లోకమంతా మోగబోతోంది; నిన్నరాత్రి రెండు



గంటలప్పుడు ఒక పెద్ద వెలుగు బంగారుతేజము, బంగారు మెత్తదనము కలది ఆకాశంమీదనించి బైలుదేరి మెల్లిగా క్రమంగా భూమిమీదికి దిగింది. నేను చూస్తోనే వున్నాను. అంతవరకు నాకు నిద్ర పట్టించనేలేదు. నా హృదయంలో అద్భుతమైన భక్తి వుద్భవించింది. దేవతలు నిస్వనము లూదారు. పుష్ప వర్షం కురిసింది. మునులు కీర్తనలు పాడారు. అవన్నీ మీకు వినపడవు. ఆ తేజస్సు భూగోళము పైని ఒక్క నిమిషం నిలిచి వెతికి మనదేశంవేపు తిరిగి, మన వూళ్లో ప్రవేశించింది. ఏదో అవతార ప్రారంభమని నాకు తెలియనే తెలుసు. ఈ తాటిపర్రులో యే గర్భంలోనో ఈశ్వర తేజస్సు అవతారమెత్తిందని స్పష్టమయింది. కాని ఈ అవతారం అవసర మేమని యోచిస్తూ నిద్రపోయినాను. కన్నులు మూయగానే నాముందు శ్వేతాంబర ధరుడు, రక్తనేత్రుడు, దయా ప్రపూర్ణుడైన దేవదూత దివ్య తేజస్సుతో వెలుగులో, నిలబడి ఇట్లా అన్నాడు; "వత్సా! ఇందాకటి వెలుగును నువ్వు చూసే వుంటావు. దాన్ని, రహస్యాన్ని నీకు తెలుపడానికై నేను పంపబడ్డాను. ఆ దివ్య తేజస్సొక మనుష్య గర్భాన ప్రవేశించబోతోంది. దానిని కాపాడవలసిన విధి నీపైన నిర్ణయించబడ్డది. నీ తరువాత పుణ్యాత్ములైన ఈ పుణ్యక్షేత్రపు ప్రజలపైన వుంది. ఈ అవతారానికి కారణము విను, పురుషధర్మం చెడ్డదా, లోకానికి ఆపద లేదు. కాని గృహిణి, మాతయైన స్త్రీ శీలం చెడిందా ప్రపంచం మొదలంట నాశనమే. కలిపురుషుడు పురుషుల్ని ఆక్రమించాడు, ధ్వంసం చేశాడు. పరిక్రమించాడు. ఇప్పుడు స్త్రీలని కదిల్చాడు. ఈనాడు స్త్రీల ధర్మాన్ని ఆచారాన్ని నాశనానికై బద్ధకంకణ్ణుడైనాడు, అతని అధికారం సాగిందా, ఇంక ప్రపంచ వినాశమే ! ఆ ఆపదనించి లోకాన్నుద్ధరించడానికే ఈ అవతార మవసరమయింది. ఎంతో బలవంతంమీద తన అర్ధాంగిని, పార్వతిని, కొంతకాలం ఎడబాసి వుండడానికి మంగళమూర్తి పరమేశ్వరుడు అంగీకరించాడు. సమస్త దేశాలలో పవిత్ర దేశమూ, కర్మభూమియైన ఈ భారతదేశంలో స్త్రీ ధర్మ పునరుద్ధరణకై విరివిగా వ్యాపిస్తున్న ఈ పునర్వివాహ, విద్యాదిమహాపాతక విధ్వంసనానికి ఆంబ అవతారమెత్తుతుంది. మహిషాసుర మర్దని సంస్కార ప్రియమర్ధని కాబోవుతున్నది. ప్రాముఖ్యంగా స్త్రీ ప్రాతివ్రత్యానికి మూలవిరాట్టగు వితంతువుల నుద్ధరింపబూనిన పార్వతి వితంతు గర్భాన్నే జన్మమెత్తి పురుషుడి నిమిత్తం లేకుండానే తాను ప్రవేశించి, అవతార మెత్తతలుచుకున్నది. రేపురాత్రి గర్భ ప్రవేశము, నవమాసములు కాలాతీతము గనుక షణ్మాసాలలోనే ఆమె భూపతనము కాదలుచుకున్నది. ఈ పుణ్యక్షేత్రంలోని వితంతు వర్గంలో ఒకరిని దీక్షాపరురాలిని ప్రత్యేకించి నీవు చూచినట్టయితే ఆమెలో ప్రవేశింప ఆ జ్యోతి పూనుకున్నది' ' అనిచెప్పి అంతర్ధానమైనాడు.

ఎవరు ఆ అనుగ్రహానికి పాత్రులో, మీలో, ఎవరో, నిర్ణయించండి. కాని ఒకటి మరచిపోకూడదు. ఆమె వితంతువు ఐవుండాలి. ఇంతవరకు ఏ పురుష స్పర్శను యెరిగి వుండకూడదు. ఈ విషయము ఏ మాత్రము దోషమున్నా ఆ జ్యోతి భగ్గున నిలువునా మనిషిని కాలుస్తుంది. "ఎవరు యోగ్యులో వారే అగ్గిగుండాని కెదురుగా నిలబడండి"

అబ్బా యిదేమిటి? ·యిట్లా చేస్తున్నాడు? వొళ్ళంతా నీచమైపోతోంది. తన ఊపిరాడకుండా అదుముతున్నాడు.

"వుండండి-స్వామీ-నన్నొదలండి."

"స్వామి ఎవరు? మాట్లాడకు. చచ్చిపోతావు. పాపం! భస్మమై పోతావు. కదలక అయిపోయింది. వుండు-నేను ఈశ్వరిని. నా జ్యోతి నీలో ప్రవేశించింది. ధన్యురాలవై నావు."

కళ్లు మూసుకుంది. అతని వూపిరి అతితీక్ష్ణంగా ఆమె మొహానికి తగులుతోంది "ఏం జరిగినా, ఏమైనాసరే కదలకు. కదిలావా. తల సహస్ర... నేను మంత్రస్వరూపిణిని మహామంత్రంలో వున్నాను."

ఆమె కదలలేదు.

తెల్లవారికట్ట మూడింటిదాకా చలి ఆగలేదు, తీర్థులకి.

రెండు నెల్లయింది.

ఒకనాడు మధ్యాహ్నం పున్నమ్మ శిరసువంచి భక్తితో "నాకు మందు కావాలి" అంది సవ్రమతగా.

"ఎందుకు?"

"ప్రొద్దున్నే వాంతులుగా వున్నాయి"

"ఒహో! సరే నయం చేస్తాను"

ఆనాటినుంచి ప్రతిదినమూ తీర్థులు ఏదో గొప్ప గొప్ప మందులు తయారుచేసి యిచ్చాడు-కాని డోకులు మాత్రం కట్టనేలేదు. "ఈ మందుతో ఇల్లాంటి డోకులు ఎన్నో కట్టించాను. కాని నీ దేహం చాలా విచిత్రంగా వుంది. ఇక లాభంలేదు. ఇవి కట్టే డోకులు కావు. మంత్రమో తంత్రమో ప్రయోగించాలి" అన్నాడు.

మూడునెల్లయింది. పున్నమ్మ కళ్ళు ఇంకా అంతర్ముఖములైనాయి. ఆమె చెంపలు ఇంకా పాలిపోయినాయి. ఆమె మాటలు ఇంకా తక్కువైనాయి. ఆమె సేవలు ఇంకా ప్రొద్దుపోతున్నాయి.

తీర్థులు ఆ వర్షాకాలం యజ్ఞం మొదలుపెట్టాడు. అగ్ని గుండము ముందు ఆయన కూర్చొని వున్నాడు. వందమంది. బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు. పున్నమ్మ సామగ్రులు అందిస్తోంది. ఊరంతా ఆహ్వానింపబడ్డారు. తీర్థులు లేచి ఇట్లా మాట్లాడాడు. "ఒక గొప్ప విశేషం ఈ దేశానికి. ఈ దేశానికే కాదు, లోకానికంతా మంగళకరమైన వార్త నేను నీకు చెప్పబోతున్నాను. ఈ తాటిపర్రు ఈశ్వరుడిచేత అనుగ్రహింపబడ్డది. ఈ ప్రజలందరూ ధన్యులు. ఇంత పుణ్యక్షేత్రం కావడంచేతనే ఈశ్వరుడు నన్నిక్కడికి పంపినట్టున్నాడు. ఈ వూరి నామం యింకా లోకమంతా మోగబోతోంది; నిన్నరాత్రి రెండు



గంటలప్పుడు ఒక పెద్ద వెలుగు బంగారుతేజము, బంగారు మెత్తదనము కలది ఆకాశంమీదనించి బైలుదేరి మెల్లిగా క్రమంగా భూమిమీదికి దిగింది. నేను చూస్తోనే వున్నాను. అంతవరకు నాకు నిద్ర పట్టించనేలేదు. నా హృదయంలో అద్భుతమైన భక్తి వుద్భవించింది. దేవతలు నిస్వనము లూదారు. పుష్ప వర్షం కురిసింది. మునులు కీర్తనలు పాడారు. అవన్నీ మీకు వినపడవు. ఆ తేజస్సు భూగోళము పైని ఒక్క నిమిషం నిలిచి వెతికి మనదేశంవేపు తిరిగి, మన వూళ్లో ప్రవేశించింది. ఏదో అవతార ప్రారంభమని నాకు తెలియనే తెలుసు. ఈ తాటిపర్రులో యే గర్భంలోనో ఈశ్వర తేజస్సు అవతారమెత్తిందని స్పష్టమయింది. కాని ఈ అవతారం అవసర మేమని యోచిస్తూ నిద్రపోయినాను. కన్నులు మూయగానే నాముందు శ్వేతాంబర ధరుడు, రక్తనేత్రుడు, దయా ప్రపూర్ణుడైన దేవదూత దివ్య తేజస్సుతో వెలుగులో, నిలబడి ఇట్లా అన్నాడు; "వత్సా! ఇందాకటి వెలుగును నువ్వు చూసే వుంటావు. దాన్ని, రహస్యాన్ని నీకు తెలుపడానికై నేను పంపబడ్డాను. ఆ దివ్య తేజస్సొక మనుష్య గర్భాన ప్రవేశించబోతోంది. దానిని కాపాడవలసిన విధి నీపైన నిర్ణయించబడ్డది. నీ తరువాత పుణ్యాత్ములైన ఈ పుణ్యక్షేత్రపు ప్రజలపైన వుంది. ఈ అవతారానికి కారణము విను, పురుషధర్మం చెడ్డదా, లోకానికి ఆపద లేదు. కాని గృహిణి, మాతయైన స్త్రీ శీలం చెడిందా ప్రపంచం మొదలంట నాశనమే. కలిపురుషుడు పురుషుల్ని ఆక్రమించాడు, ధ్వంసం చేశాడు. పరిక్రమించాడు. ఇప్పుడు స్త్రీలని కదిల్చాడు. ఈనాడు స్త్రీల ధర్మాన్ని ఆచారాన్ని నాశనానికై బద్ధకంకణ్ణుడైనాడు, అతని అధికారం సాగిందా, ఇంక ప్రపంచ వినాశమే ! ఆ ఆపదనించి లోకాన్నుద్ధరించడానికే ఈ అవతార మవసరమయింది. ఎంతో బలవంతంమీద తన అర్ధాంగిని, పార్వతిని, కొంతకాలం ఎడబాసి వుండడానికి మంగళమూర్తి పరమేశ్వరుడు అంగీకరించాడు. సమస్త దేశాలలో పవిత్ర దేశమూ, కర్మభూమియైన ఈ భారతదేశంలో స్త్రీ ధర్మ పునరుద్ధరణకై విరివిగా వ్యాపిస్తున్న ఈ పునర్వివాహ, విద్యాదిమహాపాతక విధ్వంసనానికి ఆంబ అవతారమెత్తుతుంది. మహిషాసుర మర్దని సంస్కార ప్రియమర్ధని కాబోవుతున్నది. ప్రాముఖ్యంగా స్త్రీ ప్రాతివ్రత్యానికి మూలవిరాట్టగు వితంతువుల నుద్ధరింపబూనిన పార్వతి వితంతు గర్భాన్నే జన్మమెత్తి పురుషుడి నిమిత్తం లేకుండానే తాను ప్రవేశించి, అవతార మెత్తతలుచుకున్నది. రేపురాత్రి గర్భ ప్రవేశము, నవమాసములు కాలాతీతము గనుక షణ్మాసాలలోనే ఆమె భూపతనము కాదలుచుకున్నది. ఈ పుణ్యక్షేత్రంలోని వితంతు వర్గంలో ఒకరిని దీక్షాపరురాలిని ప్రత్యేకించి నీవు చూచినట్టయితే ఆమెలో ప్రవేశింప ఆ జ్యోతి పూనుకున్నది' ' అనిచెప్పి అంతర్ధానమైనాడు.

ఎవరు ఆ అనుగ్రహానికి పాత్రులో, మీలో, ఎవరో, నిర్ణయించండి. కాని ఒకటి మరచిపోకూడదు. ఆమె వితంతువు ఐవుండాలి. ఇంతవరకు ఏ పురుష స్పర్శను యెరిగి వుండకూడదు. ఈ విషయము ఏ మాత్రము దోషమున్నా ఆ జ్యోతి భగ్గున నిలువునా మనిషిని కాలుస్తుంది. "ఎవరు యోగ్యులో వారే అగ్గిగుండాని కెదురుగా నిలబడండి"

అన్నాడు సభంతా నిశ్శబ్దం. ఎవరూ ముందుకురాలేదు. "ఎవరూ! ఒక్కరూ, లేరా?" అన్నా

"ఎవరూ లేరా, ఈ పుణ్యక్షేత్రంలో?

బాల వితంతువులను వెతుకుతున్నాయి, సభికుల కళ్ళు.

"ఎవరూ రాకపోతే.-"

అంటూ క్రిందికి వాల్చిన కళ్ళతో, వొణుకుతున్న పెదవులతో మెల్లిగా వ నుంచుంది, పున్నమ్మ.

పున్నమ్మని చూచి అందరూ ఆనందపరవశులైనారు. "ఈనాటినుంచి ఆర్నె వరకు నీ వీశ్వరపత్నివి, సుమంగళివి , ధన్యురాలవు." అని తానే కుంకుమను ఆ నొసట పెట్టాడు. పూలదండలు వేశాడు.

ఆ రోజునుంచి పున్నమ్మ పూర్తిగా ముత్తయిదువేషం ధరించింది. ఆ పుణ్యవే ఆమెకి కొత్త అందాన్నిచ్చింది. ఆ ఆర్నెల్లు ఆమెని మధ్య కూర్చోబెట్టి భజనలు, పూజలు పురస్కారాలూ, నైవేద్యాలూ, ఎగిరిపోతున్నాయి. ఈ వార్త వ్యాపించి అనేక ప్రదేశాలనుం ప్రజలు వచ్చిచూసి పోతున్నారు. విచిత్రంగా ఆమెకి గర్భచిహ్నాలన్నీ కలిగాయి. తీర్థు కూడా ఆమెకి నమస్కారాలూ, పూజలూ సాగించాడు. తనకి చాకిరీచెయ్యనీడు. తన శుశ్రూ రాత్రులు వుండనీడు. రోజూ అందర్నీ కూచోబెట్టి, ఆ అవతారకన్య చెయ్యగ ఘనకార్యలనూ పునరుద్ధరణనూ గురించి పెద్ద వుపన్యాసాలిస్తున్నాడు. త్రిలోకాలు సంతోషిస్తున్నాయనీ, దేవతలు మంగళహారతులతో వొచ్చిపోతు న్నారనీ, పూలవర్షాలు కురుస్తున్నాయనీ; కాని అవిశ్వాసకులు ప్రబలం కావడంచాతా, మ్లేచ్ఛ ప్రభుత్వం కావడం చేతా, ఆ వుత్సవాలన్నీ ప్రజలు కంటబడేటట్టు చెయ్యటం లేదన్నాడు.

ఆఖరికి తీర్థులు చెప్పినట్లు ఆరోనెల కూడా నిండకుండానే నొప్పులు వచ్చాయి. ఆ వార్త వ్యాపించగానే చుట్టుప్రక్కల ప్రజలందరూ వేలకొలది పోగైనారు. ఒకటే భజనలు, ప్రార్థనలు, వీలైనంతమంది స్త్రీలు గదిలోపల చేరారు. నాలుగుగంటలు శ్రమపడ్డ తరవాత "ఉదయించింది ఉదయించిం"దన్నారు. ఉత్పాతాలు జరుగుతాయో, లేక శుభశూచకాలు కలుగుతాయో, తమ కళ్ళు భరించగలవో లేదో అని అందరూ కళ్ళు మూసుకున్నారు. ఎంతకాలం కళ్ళు మూసుకున్నా యేమీ జరగలేదు. కళ్ళు తెరిచారు. గదిలో వాళ్ళ బిడ్డని చూపరు. మాట్లాడరు.

చివరికి తీర్థులు వొచ్చి-

"నాకు తెలీకండా దేవికి ఏదో అపచారం జరిగింది. కనక అవతారం వుపసంహరించుకుంది. జపంచేసి కనుక్కుని చెపుతాను" అని మళ్ళీ కనపళ్ళేదు ఆ పూళ్ళో. చివరికి పుట్టిన పిల్లని చూస్తే కదలడంలేదు. దానికి మొహమంతా, గుంటలు, ఎవరో డాక్టరొకడుండి- "ఇది సిఫిలిస్" పిల్లరా అన్నాడు.

★ ★ ★

# ఎదగనేలేదు

గోదావరి యిసికలంకల వెనక సూర్యుడు అస్తమిస్తున్నాడు. నల్లని నీడమీద, తెల్లని తెరచాప తేలిపోతోంది. వూళ్ళోంచి బిందె పట్టుకొని ఒక అమ్మాయి మా రేవువేపు వొచ్చింది. మమ్మల్ని చూసి కళ్ళుదింపి మీతో నాకేమీ సంబంధం లేదన్నట్టు దూరంగా వొంపుతిరిగి రేవులోకి దిగింది. ఆమె వొళ్ళు సన్నం. ఏళ్లు పద్దెనిమిది వుండవు. కళ్ళల్లో బండికి కట్టే ఎద్దుకి వుండే 'యింక యీ చాకిరీ, బాధా తప్పవనే' నిరాశతో కూడిన దీనమైన చూపు. వొళ్లంతా జావవలె కిందికి వేళ్ళాడిపోయింది, అంత సన్నని వొళ్లు అట్లా జారిపోతే, చాలా అసహ్యం వేస్తుంది; ఎంత అన్యాయం జరిగిందో అని, విచారం కలుగుతుంది. బిందెలో నీళ్ళుముంచి, యెత్తబోయి ఆయాసపడి, కళ్ళు కిందికివాల్చి నుంచుంది. ఎవరన్నా ఆడవాళ్లు వొస్తున్నా రేమోనని చూసింది. ఎవరని అలలు బిందెని ప్రశ్నిస్తున్నాయి. రామ్మూర్తి మెల్లిగా లేచి బిందెపట్టుకుని ఆమె బుజాని కెత్తబోయినాడు. కాని ఆమె చప్పున పక్కకు తిరిగింది, బిందెనక్కడే పెట్టి వెనక్కి వొచ్చి కూచున్నాడు. ఆమె అభిమానం యెక్కువై ముందు ఆ నీళ్ళన్నీ పారపోసింది. మాకు కులం లేదని తెలుసునా అనుకున్నాను. మళ్ళీ ముంచుకుని, కష్టపడి మోకాలుమీద మోపుకుని, ప్రయత్నించి బుజానికెత్తుకుంది. ఆ బిందె బరువు కింద ఏ నిమిషాన ముద్దగా కూలుతుందో అనిపించింది నాకు.

సూర్యుడు బ్రిడ్జీ వెనకాల ఇసిక తిన్నెలలో అస్తమిస్తున్నాడు. నీటి కాకులు మా నెత్తిమీదిగా యెగిరిపోతున్నాయి. నిరాశలో గోదావరి నీళ్లు వొడ్డున తపుకుమని కొట్టుకుంటున్నాయి. మా హృదయాల్లో చెప్పలేని భీతితో కూడిన దిగులు కలిగింది. జీవితంలోని నిరాశల, నిష్ప్రయోజనమూ, కష్టమూ, అంధకారమూ, అన్నీ మనసుల నావరించాయి.

వుండుండి రామమూర్తి,

"వాణ్నేం చెయ్యాలంటావు ?" అన్నాడు. ప్రేమించి ప్రేమించి ఒకరి సాఫల్యము నెరగక అట్లానే చచ్చిపోయినవాళ్ళ గంభీరమైన బాధని గురిం యోచిస్తున్న నా మనస్సుని తిప్పి నేను, "యెవర్ని ?" అన్నాను.

"ఆ అమ్మాయిని యీ విధంగా చితకకొట్టిన రాక్షసుణ్ణి."

"పెనిమిటినేనా ?"

"మూడేళ్ళల్లో చూడు, ఆ అందాన్నంతా-ఆ ...అం....దా.... ....ం....తా....ఆ లావ.....ణ్యాన్ని....కోమ....లత్వా....న్ని...."

"ఎరుగుదువా యేమిటి ?"

రామ్మూర్తి నామాట వినిపించుకోలేదు. అతని దృష్టి యెక్క జ్ఞాపకంలో వుంది.

"బడినించి నవ్వుతో పరిగెత్తుతో వెడుతోండేది. లేడి పిల్లలా గంతులేస్తో, నవ్వుతో, ఇటూ అటూ సంతోషంగా చూస్తో,.... పైకి తిరిగిన చి ముక్కూ అమాయకపు చిన్న నోరూ-"

"ఆ పిల్లేనా, యీమె!"

"ఎదిగింది చక్కగా కోమలంగా యెదిగింది. మామిడిగున్న లా పెద్ద జుట్టు-సున్నగా గుండ్రంగా మెడ-జుట్టు ఆరబోసుకుంటే కనపడేది చేతులో! పాపం, పాపం అంత అందంగానూ పెరుగుతుందనుకున్నా అట్లానే కలకల నవ్వుతోనే ఎండలో నుంచోడమే వీధివంక చూడ్డమే ఆనందమైనట్టు, చూసేది. ఇంకేం అందుకున్నాడు వాడు! బతకగలడా ఆమె నలిపెయ్యకుండా ? దేహాన్నే కాదు-ఆమె అందాన్ని, ఆనందాన్ని, మెదడు స్వేచ్ఛని, జీవాన్ని కొరుక్కుతిన్నాడు. పీల్చాడు, పిప్పిచేశాడు. అయ్యో! హృదయాన్ని, కత్తితో పెల్లగించి తినేశాడు. ఆ కళ్ళలో ఆ శూన్యదృష్టిని, నిరా భీతిని చూశావా? ఏం చెయ్యను వాణ్ణి ?"

"లేవదీసుకుపోదాం" అని నాకు తెలిసిన ఒక్క సూత్రాన్ని అనేశా

"ఎవర్ని ?"



"ఈమెని"

"ఎందుకు ?"

"వాడు యేడ్చి చచ్చేందుకు."

"చాలా సంతోషిస్తాడు. ఇక యీమె యెందుకు వాడికి! ఇంకెవర్ని పట్టి చీల్చుకు తింటున్నాడో! రాక్షసుడు! ఈ శవమెందుకు వాడికి ?"

రామ్మూర్తి కోపంతో లేచాడు.

"వాడి కేమధికారం వుంది. అందాన్ని యిట్లా నాశనం చెయ్యడానికి! ఒక మంచిపటాన్ని చింపితే తంతారే బతికివుండి, హృదయముండి, రోజురోజు కొత్తగా మారే ఆమె సౌందర్యాన్ని-యే చట్టప్రకారమూ ఏమీ చెయ్యరూ ? హృదయం చీల్చుకుతింటే ఏమీ చెయ్యరూ! గొంతుక పిసికితే వురితీస్తారే ?....కలవకాడ నీళ్ళల్లోంచి కాంతివేపు వొంపు తిరిగినట్టు వుండేది ఆమె మెడ, ఆ యవ్వనం మొదలు పెట్టినప్పుడు మెలిపెట్టాడు, తుంపాడు దరిద్రుడు-"

సూర్యుడు అస్తమించినచోట ఎఱ్ఱగా వుంది. గోదావరి నీటిమీద నలుపు కమ్మింది. నల్లని కాళి నాలుకవలె నీళ్ళు వొడ్డున కోపంతో నాకుతున్నాయి.

నాలుగురోజులు తరవాత గోదావరి వొడ్డును ఆచోటనే శవంచుట్టూ మనుషులు కూడారు సాయంత్రం. గంపులోకూడా దూరి, చూసివొచ్చాడు రామ్మూర్తి. మొహం అంతా తెల్లపడ్డది. కళ్లు మాత్రం మెరుస్తున్నాయి. చేతులూ పెదిమలూ వొణుకుతున్నాయి.

"అదే ఆ పిల్లే, చంపాడు. చంపాడు"

అంటోనే ఆ గుంపుని వెతికి ఒకడిమీద దృష్టిని నిలిపాడు. రాక్షసుణ్ణో, ఘాతకుణ్ణో చూసినట్టు చూస్తో, చిన్నకళ్ళు పెద్దవిచేసి, నా చెయ్యి గట్టిగా పట్టుకుని, "వాడే, వాడే" అన్నాడు.

"ఎవరు ?"

"దాని మొగుడు."

ఇంక ఆలస్యమైతే యింకో హత్య జరుగుతుందని భయపడి, బలవంతంగా అతన్ని లాక్కుపోయి దూరంగా యిసికమీద కూచోపెట్టాను.

దాహమైవచ్చిన గబ్బిలం సొమ్మసిల్లి నీళ్లమీదపడి తన్ను కుంటోం నెత్తిమీద యెగిరిపొయ్యే నీళ్ళకాకి జాలిగా అరిచింది. నలుపు రెండో వొ మింగేసింది.

ఒక్కమాట మాట్లాడ్డం కూడా సహించని దిగులులో యిద్దరమ కూచుని వున్నాము.

శవంచుట్టూ వున్న గుంపు చెదిరిపోయింది. మసకలో ఒక మ అట్లా నడుస్తూ మా వేపు వచ్చి, మాకు కొంచెం దూరంలో కూచున్నా రామ్మూర్తి చప్పున తలెత్తి అతన్ని చూసి-

"ఎందుకు చంపావు ?" అని అడిగాడు.

"నేనే చంపానా ?" అన్నాడు అతను, మాతోకాక, తనని ప్రశ్నించుకున్నట్టు. "నువ్వే! ముమ్మాటికీ నువ్వే! ఈ లోకంలో నీకు శిక్ష పోవొచ్చు...."

"నేనేనా! నేనే ఐతే శిక్షపడతాను. పడనుమరి! ఇంకా సందేహిస్తావేం ?"

రామ్మూర్తి లేచాడు.

"ఏం చేశావు? చెప్పు ముందు. ఏం చేశావు? నీ చేతులతో న తోశావా? ఆమె అంతట ఆమె పడ్డదా, హింసించావా? దుర్మార్గుడా, పశు

పెద్ద పోట్లాట జరుగుతుందని భయపడ్డాను. కాని తిట్లనీ, చివా లక్ష్యపెట్టే స్థితిలో లేడు. అతను ఆశ్చర్యంతో ప్రశ్నార్థకంగా నా వంక చూశా నేను రామ్మూర్తిని కూచోపెట్టాను. ఆ భర్త వాలకం చూస్తే భయంకన్న వి ఎక్కువలాగు కనపడుతోంది. అతను నిర్దోషి అని అనుకున్నాను, అతని జాలి కలిగింది. సానుభూతికోసం వెతుకుతున్న వాడివలె కనపడ్డాడు.

"ఇక్కడ వుండవద్దు ఛీ, పోదాం, రా" అంటున్న రామ్మూర్తిని లక్ష చెయ్యక, ఆ భర్త పక్కన కూచుని-

"ఎందుకు చచ్చిపోయిందో తెలుసునా?" అని అడిగాను.

"తెలుసునో, తెలీదో, తెలీటంలేదు."

"తెలీదూ! ఎందుకు తెలుస్తుంది నీకు?" అని యింకా యే



దూషించబోతున్నాడు రామ్మూర్తి.

"నన్నెరుగుదురా? ఎందుకంత ఆగ్రహం!"

"ఎరుగుదునా! ఎరగాలా! ఆమెని పాపం, చిన్నపిల్లని, నలిపి, చీల్చి, పీల్చి, పీనుగనిచేసి, ఇంకవేరే చంపాలా? నిజంగా చంపితేనేం చంపకపోతే నేం? నీ మొహం చూస్తేనే పంచ మహాపాతకాలూ చుట్టుకుంటాయి."

ఎవరమూ మాట్టాడకండా కూచున్నాము. నేను దయగా-

"ఎందుకు గోదావరిలో పడ్డది?" అన్నాను మళ్ళీ.

"పొద్దుణ్ణించి అందరూ నన్ను వోదార్చినవారే. కాని అందరికీ మనసుల్లో నేనే చంపానని వున్నట్టుంది. నేనే కారణమని నమ్మకం. ఈయన యెవరో పైకి అన్నాడు, అంతే భేదం. కాని నేనే కారణమా అని ఆలోచిస్తున్నాను."

"ఇంకా ఆలోచించాలా? నువ్వు కాకపోతే ఇంకెవరు, ఆమె కళ్ళల్లోకి ఆ హృదయభేదకమైన చూపు తెప్పించింది?"

రామ్మూర్తి మాటల్ని లక్ష్యం చెయ్యక అతను చెపుతున్నాడు;

"మొదటినించీ మేము చాలా ప్రేమించుకున్నాము. ఆడవాళ్ళ వొంటి అందమంటే నాకు చాలా తృష్ణ. ఇది చాలా అందమైనది. కాని వికార రూపాన్ని నేను భరించలేను. అందాన్ని చూస్తే, అందాన్ని చేత్తో తాకితే, ఇంక నావొళ్లు నాకు తెలీదు. దానికి నామీది చాలా మోహం వుండేది. యవ్వన వుధ్రుతంవల్ల, ఇంక మేము వొకర్ని వొకరం నలిపి, పీల్చి, రాత్రులు, పగలు యెంతో అనుభవించాము. అందుకోసమే ఒకరికోసం ఒకరం బతికాము. భోజనమూ, అనుభవమూ, శక్తిని పోగొట్టుకోవడమూ, మళ్ళీ సంపాయించడమూ, ఇట్లా రెండు మూడు సంవత్సరాలు బతికాము. కాని అది రెండు నిమిషాల్లాగుంది నా మనసులో. ఎండాకాలపు రాత్రులు జోరుమనే వానలో గదిలో మేము వెచ్చగా క్రీడించిన ఆనందాలు, ఒకరిని ఒకరం గాఢంగా ప్రేమించి గాయపరచడం-అట్లాంటి ఆనందం జీవితానికల్లా ఒక్కసారే కలుగుతుంది. కాని క్రమేపీ అది నా చేతుల్లో నలిగి, వేళ్ళాడిపోవడం నా కళ్ళు గుర్తుపట్టాయి. నేను గట్టిగా వాడుకునే స్థలము ప్రతిదీ కృశించింది. వాడిపోయి ముడతలు

పడ్డది. నేనుమాత్రం అట్లానే వున్నాను. నా శరీరం ఇంకా అంద
తయారయింది. దాని ముద్దులలో కౌగిలింతలతో...."

"పశువా?"

"నేనేం చేశాను? దాని కోరికా నా కోరికా ఏకమైనాయి. కాని స్త్రీల యెడల క్రూరమయింది. పువ్వులో అందం ఒక్క నిమిషంలో నశిస్తుం రాయి మెరుపు అట్లానే వుంటుంది. మనమేం చేస్తాం?"

"పెద్దవాడివి, ఆడదాని సౌందర్యాన్ని ధ్వంసం చెయ్యకూడదని తెలీదు"

"ఎట్లా తెలుసు! మీరు చెప్పారా ? ఎవరైనా వొద్దన్నారా ? మా మోహ చూసి, చాలామంది అసూయపడ్డారు. ఇంతలో దానికి గర్భం కలిగి అదివరకు దానిచేతులు సన్నపడ్డా, రొమ్ము కృశించినా, అద్దం వం దానిపొట్టనీ విల్లువంటి దాని నడుము వొంపునీ చూసి తృప్తిపడే వాణ్ణి. ఆ నడుము సాగి, పొట్ట పెద్దదై, ఆ మొహంకూడా వాడేటప్పటికి, దాని చూడ్డమే కష్టమయింది. పూర్వపు ప్రేమతో నా దగ్గిరికి వొచ్చేది. కాని చూడ కళ్ళు తిప్పుకునేవాణ్ణి. అది తాకితే జెర్రులు పాకినట్టుండేది. దాని పడుకోవలసి వొస్తుందని, స్నేహితుల ఇళ్ళల్లో వుండేవాణ్ణి. తనమీద ప్రే పోయిందని యెడిస్తే యేమనను ? పోయింది ఇంకరాదు. తన తప్పిదమే అడిగేది. ఏముంది ?"

"అంతా నీ తప్పిదమే." అన్నాడు రామమూర్తి. "నాదా ? నా కెం దిగులేసేది. నాకు ఏడుపొచ్చేది దాన్ని అట్లా కష్టపెట్టడం. కాని ఏ చాతనయ్యేదికాదు. దాన్ని లాలించడమన్నా చివరికి సాధ్యం కాలేదు చీదరించుకున్నాను, తిట్టాను, దాని మొహాన్ని భరించలేక, ఏమీ లేనిదే ఏ నాకు ముండలున్నారన్నాను. రెండు రోజులు కోపంతో మూతి ముడుచుకుం నేను బతిమాలుకుంటానని అది అనుకుంటే, నన్ను వొదిలింది కదా అ నేను సంతోషించాను. కాని "పోనీ క్షమించా" నంటో వచ్చింది, ఇం భరించలేక తన్నాను-పోయింది-దాన్ని ఎంతో హింసించాను. కాని యెం ప్రయత్నించినా నాకు ఆ అసహ్యం ఆగలేదు. ఆ గర్భిణీస్త్రీని కొట్టటం ఎం పేగులు తరుక్కుపోయినా, పశ్చాత్తాపం చూపానా, నన్ను పట్టుకుంటుంది భయం. అంత దుఃఖమూ లోపల అణుచుకుని, జాలిని చంపుకుని, కోపం



కనపడేవాణ్ణి. ఒక నాటి రాత్రి, అది ఎంత ప్రేమతో లేపినా, మాట్లాడకండా పడుకుంటే, పాపం, విసుకెత్తి, "పోనీ, కొట్టండి. అదే బావుంటుంది" అంది. ఎంత యేడ్చానా రాత్రి ! పూర్వపు ప్రేమ జ్ఞాపకంతెచ్చి ఏడిపించేది ! ఓహో మేము గడిపిన రాత్రులు, మా సరసాలు, మా నవ్వులు ! యామైనాయో ! దాని పాదాల దగ్గిర కూచుని "నువ్వు నా రాణివి. నా హృదయేశ్వరివి. ఈ బతుకుసంతా వెలిగించావు. నువ్వు లేనిది ఒక్క నిమిషం బతకలే" ననడం జ్ఞాపక మొచ్చేది. ఏం చెయ్యనూ, "అన్నీ దొంగమాటలేనా," అని అది అడిగితే పేగులు తరుక్కుపొయ్యేవి. చివరికి ఒకవిధంగా దాన్ని వోదార్చాను. పురుడు కాగానే మళ్ళా అందంగా వుంటుందనీ, ఆ గర్భిణీ నెలలలో మోహం ఆరోగ్యంకాదనీ చెప్పాను. నమ్మింది కొత్త సంతోషం వొచ్చింది. కలకలనవ్వింది. ఎంతో ప్రయత్నించినా దగ్గిరికి రాలేదు, అటుతరవాత."

"ఒకనాటి రాత్రి దానికి నరాలు పట్టుకున్నాయి. మా అత్తా దానిచెల్లెలూ, వొచ్చి పడుకున్నారు. రాత్రి అవసరమొస్తుందేమోనని, అదీ, దాని చెల్లెలూ పట్టెమంచంమీద పడుకున్నారు. దానిపక్కన కింద చాపేసుకుని మా అత్త పడుకుంది. కొంచెం దూరంగా కిటికీదగ్గిర నులక మంచంమీద నేను పడుకున్నాను. ఇదంతా యెందుకు చెపుతున్నానంటే అంతాకర్మ, కర్మ తోసుకొస్తుంది. మనం బుద్ధిపూర్వకంగా చేసేది తక్కువ, మా గదికి ఒకటే కిటికీ. అది రోడ్డుమీదికి తెరుచుకుంటుంది. మూసుకుంటే గాలిరాదు. అందుకని దీపం లేకుండా చీకట్లో పడుకోడం మామూలు నాకు. రాత్రి దాహమై మెళుకువ వొచ్చింది. చెంబుకోసం వెతుకుదామంటే మా అత్త మధ్య యెక్కడో పడుకుని వుంది. పడుకున్నాను, కాని నిద్రరాదు. అత్తని పిలిస్తే అది లేచి మళ్ళీ మూలుగుతుందని భయం. నిద్రపోకపోతే మర్నాడు ఆఫీసులో నిద్రా, పోష్టు మాస్టరు కోప్పడ్డం. జ్ఞాపక మొచ్చి, లేచి కూర్చున్నాను. మంచం మెల్లిగా దిగి, నేలమీద జరుగుతూ, చెంబుకోసం వెతికాను. ఇటూ అటూ తడిమాను. నా వూపిరి బిగ్గిరిగా నాకే వినబడుతోంది. మా అత్తని తాకి యెక్కడ తడుముతానో అని భయం. ఆమె యేమనుకుంటుందో ఇట్లా అనుకుంటూ వుండగానే, నా చెయ్యి సరిగా గుండ్రని వెచ్చని ఆమె రొమ్ముమీద పడ్డది. భయంతో వొణికాను. అరుస్తుందో తిడుతుందో, కావలిసే చేశానంటుందో ! చెయ్యి చప్పున తియ్యబోయినాను. ఆమె నా చెయ్యినక్కడే పట్టుకుని ఆపింది.

నిజంగా చెపుతున్నా, ఆమెమీద యెప్పుడూ అట్లాంటి వుద్దేశం నాకు లే
ఆ నిమిషానా ఏమీ కోర్కె కలగలేదు. కాని ఆ అవస్థలో ఆమె చె
పట్టుకుంటే నేనేం చెయ్యను ? నా వుద్దేశ్యమది కాదని ఎట్లా చెప్ప
ఆమెమీద నాకు చాలా గౌరవం. అదిగాక ఏ మాత్రం మాట్టాడినా, వాళ్ళి
వింటారు. ఆ మర్నాడూ అత్త ఆ గదిలోనే పడుకుంది. ఈసారి నన్ను
తన పక్కమీదికి తీసుకు వెళ్ళింది.

"ఎవరితోనన్నా యీ వ్యవహారమంతా, ఈ నా బాధనం
చెప్పుకోవాలని యీ వార్త విన్నప్పుణించి అనుకుంటా. ఎవరితో చెప్పి
చెప్పుతీసుకు కొడతారని భయం. మీరేమనుకుంటున్నారో ? యేమ
అనుకోండి తీరా చెప్పేశాను."

"మా అత్తతో చాలా సౌఖ్యపడ్డాను. నా చేతుల్లో నిండిపొయ్యేది.
భార్య అందమేగాని, ఎక్కడ గట్టిగా నొక్కితే విరుగుతుందో అనిపించే
అప్పణ్ణించి అది యెదగనే లేదండి"

"ఎవరితప్పు ?" అన్నాడు రామ్మూర్తి పెంకెగా.

"అది కన్నది. కన్నాక మళ్ళీ నా కోసం వొస్తే నాకేమీ మనస్కరించలే
రోత అనిపించేది. మా అత్త 'అమ్మాయీ బుల్లెమ్మ !' అంటే, నాకు అమ్మా
లాగే కనిపించింది. ఎంతో ప్రయత్నించాను చాత కాలేదు. 'ఇప్పు
మునుపటిమల్లేనే వున్నాగా!' అంది. దాంతో నా పేగులు తరుక్కుపో
ఏడ్చాను. అది ప్రేమ అనుకుని, ప్రేమతో నన్ను సమీపించింది. ఆ రాత్రం
అత్త దగ్గిరికి వెళ్దాం, అని చూస్తున్నాను. భార్యకి దడిశి వారం రోజులను
ఆమెని చూడలేదు. గంటసేపు భరించాను. ఇంక ఊపిరాడ్డం దుర్భ
దాన్ని ఒక్కతోపుతోసి, రెండు తిట్లుతిట్టి బైటికి వెళ్ళాను. నా శరీరమం
మలినమైనట్టు, ఏదో వికారమైన పాపం చేసినట్టు, తోచి, నన్నాగతికి ఉ
దానిమీది కోపం పట్టలేక, వెనక్కి వెళ్ళి.

"ఈసారి నన్ను తాకావా నిన్ను చంపేస్తాను కుళ్ళముండా ! నిన్ను చూ
దోకు,-అని వెళ్ళిపోయినాను. తెల్లారేటప్పటికి చచ్చిపోయింది యీ నదిలోపడి."

★ ★ ★

# భాషన్నా తెలీదు

నేను కొవ్వూరులో పెద్ద బోగీలో యెక్కాను. నిండా ప్రజలున్నారు. కూచోడానికి చోటులేక తలుపు దగ్గిరిగా కూచున్న ఉత్తర హిందూ స్థానం వాళ్ళని మూటలుతీసి జాగా చెయ్యమని సౌజ్ఞ చేశాను. తియ్యడానికి వీల్లేదని ఆ పాడు భాషలో గోలచేశారు. నాకు కోపమొచ్చి మూటలెత్తి కిటికీలోంచి పారేస్తానని దడిపించాను. ప్రాణం పోతున్నట్టు అరుస్తో చేతులడ్డం పెట్టి లేచాడో ముసలివాడు, వాడి ప్రక్కన వున్న పిల్ల కళ్ళు వాడిగోలని చూసి నవ్వుతున్నాయి. నోరు మాత్రం కళ్ళతో సంబంధం లేకుండా యేదో అరుస్తోంది. సరదాపుట్టి ఆ మూట నక్కడే పడేసి ఆ స్థలంలో కూలబడ్డాను. తరవాత కూడా నా మొహం చూస్తో ఆ కళ్లు నవ్వుతోనే వున్నాయి. కాని ఆ నోరు కోపంగా గొణుకుతోంది. నల్లగా రేగి కళ్ళమీదా చెంపలమీదా, జీరాడేజుట్టూ, ఆంధ్రదేశంలో ఎక్కడా కనపడని పొడుగూ చురుకూఐన ముక్కూ, మూర్ఛల్లో మూతలు పడుతున్న కళ్ళూ, ఆమె మొహాన్ని చాలా ఆకర్షకంగా చేశాయి. గట్టిగా బిగించిన రొమ్ము, గుండ్రని గట్టితొడలూ, నున్నని బుజాలూ, దుమ్ముకొట్టిన బట్టలు కూడా దాచలేకపోయినాయి. మరీ తేరిపారి చూస్తే పోకిరిగా వుంటుందని తన నెత్తిమీదనించి యేంచూస్తున్నానా అని ముసలాడు అనుమానపడతాడేమోనని "బ్రౌనింగ్" తెరిచి నా మనసుని బంధించాలని ప్రయత్నిస్తున్నాను. కాని ఆ నవ్వుతోమా యిద్దరికీ ఏర్పడ్డ రహస్య స్నేహం నా మనసుని తొందరపెడుతోనే వుంది. షర్టుకింద నా భుజం చక్కలిగింత 'ఫీల'యింది. ముసలాడు నా డబ్బులకోసం వెతుకుతున్నాడా అని చప్పున

పక్కకి కళ్లువాల్చి చూశాను. బల్లుల లాగు రెండు పల్చని వేళ్లు నా బుజ అనుకునే బల్లకీ మధ్యనున్నాయి. మెరిసే రెండుకళ్ళు ముఖాలెత్తి చూసి నవ్వాయి. ఆ వేళ్ళకి చెందిన చెయ్యి ముసలివాడి వెనకనించి చాచుకుని వుంది. ఇటునించి ఆమెవంక చూశాను. గోదావరీ నీలజల కళ్ళలో ప్రతిఫలింపచేస్తో స్వదేశపర్వతం గంభీరత్వ స్ఫురణలో మమ రైలునీ మరచి ఏమెరుగనట్టు కూచుంది. మెల్లిగావేళ్లు నా మెడనీ, నాపీ ప్రేమతో తాకి, నా చేతుల్ని పట్టు వొదిల్చాయి. తిరిగి తిరిగి ఒక్క చిరున ఆమె మొఖాన్ని వెతికాను. పైకి తిరిగిన ఆమె పెదవిలో ఒక్క మార్పు లే ఆమె వేళ్ళని పీపుతో నొక్కాను. మెల్లిగా చేతిని చాచాను. కాని ఆ వొదుఫ నేర్పు మొగాడికి నాకు చాతనవుతుందా? ముసలివాడు చప్పున తిరిగి ఆమెతో కోపంతో ఏదో ఒక్కమాట అని వూరుకున్నాడు. గోదావరిలో రైలాగ మూటలు పట్టుకుని కిందికి దిగి ఆమెని దిగమన్నాడు. ఆమె దిగన కోపంతో కేకలేశాడు. తన స్థలంనించి కదలక ఏదో వాదిస్తుంది. ఇట్లా రెం నిమిషాలు గోలపడి మూటలు కిందపారేసి, లోపలికొచ్చి దాన్ని జుట్టుపట్టు బరబర యీడ్చాడు. ఇద్దరు ముగ్గురు సగంసగం అడ్డపడపోయి కెందుకని వూరుకున్నారు. పడుచుదాని కోసం పోట్లాడటం అందరికీ ఇష్ట కాని భయమే, సిగ్గే. కిందికి లాగి గుండెలో గుద్ది మూటలు దానిమీద ప నడిపిస్తున్నాడు. ఒక్క నిమిషంలో మేమూ నలుగురైదుగురం కిందికి దిగా తక్కిన వాళ్ళకి తమాషాగా వుందిగావును. కాని నాకా ముసలాణ్ని ఆమెని వొదిలించాలని, అణుచుకున్న కొద్దీ తుఫాను లేస్తోంది. నా వ నవ్విన చిరునవ్వు నా బుజాల్ని తాకించిన మాధుర్యం, నా కోసం నా వ ఆమె పడుతున్న బాధ- కాని నేను పోట్లాడితే వీళ్ళందరూ ఏమనుకుంటారు మధ్య నీకెందుకంటే ఏం చెప్పను? అదిగాక ఈ పిల్లకి మాత్రం ధైర్యము టుందా? వాడివేపే పలకదా? ఈమె చూపులు చూస్తే మాత్రం వాణ్ణి అక్షణా కాల్చేట్టో,. కత్తితో సరికేట్టో వున్నాయి. రాజమండ్రి స్టేషన్లో దిగి, వెళ్ళి చూశాను ఇంజను పక్క పెట్టెలో వున్నారు ఇద్దరూను. నన్నుచూసి ఆదరణగా జాలిగ ముఖం పెట్టింది. ఏం చెయ్యను? వెనక్కి వొచ్చాను. కాని ఇట్లాంటివాడి



ఆమె ఎంత బాధపడుతో వుండాలి దినదినమూ? చెప్పుకునేందుకు, అర్థం చేసుకునేందుకు, తన భాషైనా తెలిసినవాళ్ళు లేక ఈ పరదేశంలో వాడు చంపుతూ వుంటే-ఇంకా ఏం చేస్తాడో? యెక్కడికి వెడుతున్నారో? నామీద ఎంత ఆశ పెట్టుకుందో? ఎంత విశ్వసించిందో? కనుక్కుంటే? వెళ్ళి వాళ్ళ పెట్టెలో యెక్కి ఎదురుగా నుంచున్నాను. చప్పున నురుగులు కక్కుతో లేచి మూటలొక చేత్తో, ఆ పిల్ల జెబ్బనొక చేత్తో పట్టుకొని దిగాడు. పక్కనున్న ఆడవాళ్ళ పెట్టెలోకి ఆమెని తోసి తను ఇంకో పెట్టలో ఎక్కాడు. కడియందాకా నా మనసు మనసులో లేదు. ఆ స్టేషన్‌లో వెళ్ళి ఆమె కెదురుగా ప్లాట్‌ఫారం మీద నుంచున్నాను. లోపలిదీపాల వెలుతురింకా బైటికిపడటం లేదు. పొలాలమీద చల్లని గాలి వింతగా రైల్ని ఇదేమివొస్తువా అని అభిమానంతో తాకి చూస్తోంది. కిటికీలోంచి జార్చిన చెయ్యిని పట్టుకున్నాను. ఆమెవేళ్లు నావేళ్ళపైన బిగుసుకున్నాయి. గంట కొట్టారు. ఆ వేళ్ళు వొదలలేదు. నాకళ్ళు ఆమెమొహం నించి పొడుగాటి రోడ్డువైపు తిరిగాయి. దయగల ఆ వేడివేళ్ళని పట్టుకుని లోకమంతా ఎంత దీర్ఘ ప్రయాణం చేస్తేనేం ? రైలు కదులుతోంది. కొంచెం నడిచాను. ఆగి, ఆ చెయ్యిని పట్టుకునే వున్నాను. రైలు ఆమెని లాగింది. ఆ పెట్టెలో ఆమె కాక ఇంకో ముసలమ్మ మాత్రమే వుంది. నేనూ ఎక్కితేనేం? అని చెయ్యిని అట్లానే పట్టుకుని రెండో చేత్తో తలుపు తెరిచాను. అది చూసి ఆమె చప్పున లేచి తలుపుకి అడ్డంగా నుంచుంది. రానీదు, నా ప్రాణం చివుక్కుమంది. నేనింకా రైలువెంట నడుస్తున్నాను. వెనక ఎవరో కేక వేస్తున్నారు. చప్పున నా భుజంమీద చెయ్యేసి ఆమె నా పక్కకి దూకింది. అమ్మా, భాష రాకపోవడంవల్ల ఎంత ప్రమాదం జరిగింది! నేను తనని దిగమని తలుపు తీశాననుకుంది. ముసలాయనా, మూటలూ, నాట్రంకూ దాంటో నా భార్య నాగవొత్తులూ, నా యల్.టి. సర్టిఫికేటూ,నా కాకినాడ ప్రియురాలి వుత్తరాలూ, అన్నీ దూరంగా, ఎర్రదీపంముందు, నన్ను చూసి భయపడ్డట్టు పరిగెత్తుతున్నాయి, నిర్విణ్ణుణ్ణయి ఆమె మొహంవంక చూస్తో నుంచున్నాను. మాట్లాడక తెల్లబోయి, చిన్నపిల్ల వలె నేనేమంటానో అని నా వంక చూస్తో నుంచుంది. 'కావలిసే దిగావా?' అనీ, ఇంకేమీ అడగపోయి, నవ్వువచ్చి

వూరుకున్నాను. ఆమె వుద్దేశమేమో! తెలీడమెట్లా? ఎవరికైనా హిందు
తెలుసునేమో? కానీ ఈ వ్యవహారం యెవరికి చెప్పుకోను? స్టే
మనుషులందరూ వెళ్ళిపోయినారు. మా ఆలోచనా సంఘంలో చేరతలి
కుంటికుక్కవొచ్చి తోకాడించి మా మొహాలు చూస్తూ నుంచుంది. టి
వాడొచ్చాడు. కాకినాడకి కొన్న టిక్కెట్టతని చేతిలో పెట్టాను. ఈమెనడిగా
ఏం చెప్పను? ఆమె మాట్లాడక నుంచుంది. తెనుగులో హిందూస్తా
అడిగాడు. మాట్లాడలేదు. నావంక తిరిగాడు. గోలెందుకని రూపా
జేబులోనించితీసి చేతులో పెట్టాను. రెండునిమిషాలు మా యిద్దరి వ
చూసి వెళ్ళిపోయి స్టేషను దగ్గిరగా నుంచుని చూస్తున్నాడు. ఆమె ము
చెపుతోంది మా ఇద్దరికీ సజావైన సంబంధం లేదని, మాటన్నా వీలు
ఆమెని వెంటేసుకునినడిస్తే, ప్రజలందరూ ఏమంటారు? ఎక్కడికి పో
ఏం చెయ్యను? ఎంతకాలమని? తలెత్తి ఎవరి మొహం చూడ్డా
సిగ్గుగావుంది. కాని ఆమె నా పక్కన అమాయకంగా విశ్వాసం పూరి
కళ్ళతో, గుండ్రని చేతులతో, నల్లని జుట్టుతో, ముందు నేనభవిస్తాను
సౌఖ్యాల ఆశలతో నా వక్కన నుంచున్నదనే సంతోషంలో, అ
మరిచిపోయినాను. నా బట్టలూ, నా భార్యసొమ్ములూ, పుస్తకాలూ పోతే
జేబులో యాభై రూపాయలూ పక్కని యీ పిల్లా వుంది. ఇంకేంకావా
యీనాడు అట్లా అనుకొనేమో, కాని ఆనాడు అట్లా అనుకోనివాణ్ణే 
యెంత నిర్భాగ్యుణ్ణి ఐ వుండాలి? నా పెట్టెకోసం సామర్లకోట టెలిగ్రా
య్యాలనుకున్నాను. కాని నేనెక్కడ వున్నానో ముసలాడు కనుక్కుంటే. ఏ
యోచన లేకుండా స్టేషన్ దాటి యెర్రదుమ్ముతో నిండిన రోడ్డంబడి ఆ
వెనకా నేను ముందుగా నడిచాను. వూళ్ళోకి వెళ్ళడమంటే భయంగా వుం
ఎవరైనా ఏదో వొకటి అడుగుతారు. యేం చెప్పను? చిన్నతోట వుం
రోడ్డుప్రక్కన, ఇద్దరమూ అరటిచెట్టు క్రింద కూచున్నాము. చీకటి పడుతోం
గోరువంకలు యెదురుగా ఆముదంచెట్టు మీద మాట్లాడుకుంటున్నాయి. 
కాళ్ళముందు నీళ్ళ మడుగులో బాతులు రెండు యీత్తున్నాయి. మా నెత్తిమీ
బృహస్పతి వుదయించాడు. నేనామె భుజంమీద చెయ్యేసి ముఖమెత్తి 
పెదవుల్ని ముద్దుపెట్టుకున్నాను. లేచాము, బాగా చీకటయింది. దూరం



కనపడుతున్న దీపాల వేపు నడిచాము. దోవలో మళ్ళా ఆమెను దగ్గిరగా లాక్కుని పక్కగా వొత్తుకున్నాను. జీవిత మెంతో ఆనందంగా కనపడ్డది. తిండి లేకపోతేనేం, యిల్లు లేకపోతేనేం, ఆ ఎండాకాలపు పైరుగాలిలో నక్షత్రాల క్రింద ఏ గడ్డిలో పడుకుంటేనేం? ఆమె జుట్టు నా చేతులమీద పారాడుతో, ఆమె మెత్తని చల్లని శరీరం నాకానుకుని పడుకుంటే నాకేం కావాలి? దీపాల దగ్గిరగా వొచ్చాము. అది బోట్లరేవు. యీ బోటులో యెక్కి వెడితే, యెక్కడికైతేనేం? అయిదు నిమిషాల్లో గది మాట్లాడి ఆమెని లోపల కెక్కించాను. మిటాయీ, పళ్ళూ, కొనితిన్నాము. చీకట్లో గదిలో ఆమె పక్కన కూచున్నాను. మాట్లాడకుండా కూచుంది. ఆమె నన్ను పలకరించాలని యెదురు చూశాను. ఆమె కదలలేదు. నాకోసం రైలులో అంత ఆదుర్దాపడ్డ మనిషి యిట్లా కూచుందేం? దిగులుగా వుందా? ఆకలేస్తుందా? ఏవూరు? ఆ ముసలాడెవరు? అని అడగాలని వుంది. కాని యెట్లా? ఆమెకి నిజంగా నామీద మనసుందనీ, పోనీ, నాపైనే తను యిప్పుడు ఆధారపడి వున్నదనీ, ఆమెకి తెలియచేసేట్టు చెయ్యాలని వుద్దేశ్యపడ్డాను. కిందికి దిగుతున్నట్టుగా జరిగాను, మాట్లాడలేదు. దిగి యిటూ అటూ వెడుతున్నట్టు తిరిగాను. చప్పుడులేదు. లోపలికి చప్పున వెళ్ళి విప్పినకోటు వేసుకుని బైలుదేరి, ఆమె వంక చూశాను. వేలన్నా కదిలించలేదు. నాకెంతో కోపం వొచ్చింది. అరగంట సేపెక్కడో కూచున్నాను. పడవ బాకా వూదారు. లోపల వచ్చి కూచున్నాను. ఆమె తలన్నా యెత్తలేదు. రైల్లోపోయిన నాగవొత్తులకి, 'షా' పుస్తకాలకీ దిగులుదయించింది. మొహం నీళ్ళుకేసి తిప్పేసి, ఆమెతో నాకేం సంబంధం లేనట్టు ఠీవిగా సిగరెట్ కాలుస్తూ కూచున్నాను. పడవ కదిలింది. ఇంక తాళలేక, నేనా అమ్మాయి కేసి జరిగి చెంపకింద చెయ్యేసి మొహం తిప్పుకున్నాను. వేడిగా నీళ్ళు నా వేళ్ళకి తగిలాయి. పాపం ముక్కూ మొహమూ యెరగని నాతో సాహసంచేసి వచ్చేసిన యీ ముగ్ధ, యెంత భయపడుతోందో? భాషన్నా నాకు అర్థం కాదుగద! నేనేం చేసినా పడవలసిందే కద! ఇంక నాకంటె దిక్కులేక, నన్నే నమ్మిన యీ అబల పైన నామీద మోహం చూపలేదని నిష్కారణ ద్వేషాన్ని పూని, యిట్లా భయపెట్టి బాధించాను కదా, అని చాలా విచారం కలిగింది. ఆమె తలను గట్టిగా నాకదుముకుని "ఎందుకు దుఃఖం నా పిచ్చిపిల్లా! నిన్ను

వొదిలాననుకున్నావా? నిన్ను వొదిలేస్తానా? నేనున్నానుగా? యీ కంఠ
ప్రాణమున్నన్నాళ్ళు నిన్ను వొదులుతానా ? ఎందుకు విచారం ఇట్లా
అన్నాను.

యామనుకుందో ఆ మాటకి అర్థం; మొహం నాకు వొ
ప్రతిమలాగు కూచుంది. ఏమేమో మాట్లాడించాను. నాకు తెలిసిన కొ
హిందూస్తానీ ముక్కలూ, "ఆవ్, జావ్, ఖానా కాయా? కోన్‌బస్తీ" ఇవి కూ
పలికాను. అట్లానే కూచుంది. మళ్ళీ ఏవో ఆలోచనల్లో పడి నల్లని గ
వాటిల్లో మెరిసే మిణుగురు పురుగుల కేసి చూస్తో కూచున్నాను.
లాకులవద్ద పడవ ఆగింది. రాత్రి యిట్లానే గడుస్తోందే? నాపైని యెం
మోహం చూపవలసిన యీ పిల్ల మూటలాగు మూల కూచుని వు
నిద్రన్నాపోదు. ఇంత త్యాగమూ వృథా కావలసిందేనా? నిద్ర రాదు. ఆ మో
రేపే గాలిలో పడవ సాగగానే ఆమె దగ్గిరికివెళ్ళి చాలా చను
కావిలించున్నాను. మెల్లిగా నా మొహాన్ని నెట్టేసి, తల తిప్పుకుని కూచు
ఎందుకంత సిగ్గు! మళ్ళీ మళ్ళీ సమీపించాను. రెండు నిమిషాలు వోర్చు
తరువాత నిరాకరిస్తుంది. మొదట్లో ఆ అభ్యంతరం కూడా ఆకర్షణ
వుంది. వుత్తబిడియం, మొగాణ్ణి నేను చొరవ చెయ్యకపోతే యెట్లా?
కామంతో మోటసరసం ప్రారంభించాను. స్త్రీని ప్రేరేపించేందుకు వాచ్యాయ
డేమన్నాడా అని యోచించాను. నన్ను వొదుల్చుకొని గదిబైటికి వెళ్ళి
ఏమి అవసరమోనని కూచున్నాను. ఎంత సేపటికీ రాదు. వెళ్ళిచూ
టాపుమీద ఎవరో కాపు ఆడవాళ్ళ దగ్గరగా కూచునివుంది. ఎట్లా తీసుకురా
లోపలికి? యామని పిలవను? వెళ్ళి దగ్గిరగా కూచుని వాళ్ళు చూడకుం
చెయ్యిపట్టుకు లాగాను. కాని ఇంకా వాళ్ళ దగ్గిరిగా జరిగింది. వా
నవ్వుతున్నట్టు తోచింది నాకు. అధిక కోపంతో వొచ్చి గదిలో కూచున్నా
దాన్ని కాలవలో తొయ్యాలనిపించింది. కృతఘ్నురాలు! ఐనా నా చేతుల్లోం
యెక్కడికి పోతుందిలే! కాని ఆ రాత్రి వృధాగా గడపవలసిందేనా? నా ట్రంక
పోగొట్టుకున్నదీ, కాన్ఫరెన్సుకి వెళ్ళడం మానేసిందీ, ఇందుకేనా? డబ్బు
తీసుకుని, వాగ్దత్తంచేసి' మోసంచేసి నిరాకరించే భోగందానివలె ఆగ్రహ



కలిగింది దానిమీద. దీన్నేంచేస్తే ఏంతప్పు? అనుకుంటో ఆ కోపంలోనే నిద్రపోయి, ఎప్పుడో వులికిపడి లేచాను. నల్లులు కుడుతున్నాయి. సుఖంగా లక్ష్మణరావుతోనూ' అతని చెల్లెలితోనూ, మన సుబ్బారావుతోనూ, 'కాన్ఫరెన్సు' లో తిరుగుతో రామావిలాస్ నాటకాలు చూస్తోవుండవలసినవాణ్ణి, ఇట్లా యీ చెక్కలమీద, వొంటరిగా పడి రాజమండ్రివేపు పోతో వుండేగతి పట్టిందికద! ఇంత మూర్ఖుణ్ణెట్లా ఐనాను? ఈ పరదేశి కన్య నెట్లా నమ్మాను? స్త్రీలమీద కోపంతో పురాణాల్లో రాసిన సంగతులన్నీ జ్ఞాపకానికి వొచ్చాయి. కాని ఆ అమ్మాయి రైల్లో ఎంత ప్రేమ చూపింది! నన్ను నమ్మి ఆ ముసలివాణ్ణి వొదిలి- ఇప్పుడే ఆమె నా ప్రక్కన పడుకునివుంటే - ఇరవై కాన్ఫరెన్సులూ, ఇరవై సుబ్బారావులూ, ముప్పై స్తానం నరసింహారావులూ, ఎందుకు ఆ అనుభవం ముందు? నే ననుభవించగలిగి వుండే ఆనందమంతా స్ఫురణకువొచ్చి కోసమొచ్చింది! నన్నుచూసి నాకే జాలివేసింది! నన్ను కోరివచ్చిన పిల్లని పోగొట్టుకున్న నిర్భాగ్యుణ్ణి. ఆ ముసలాడి మాత్రం చెయ్యలేకపోయినాను. వాడట్లా జుట్టుపట్టుకుని యీడ్చిగుద్దితే బాగావే వుందీ! నేనింత గౌరవంచేసి కోరితే బెక్కు చేస్తోంది. ఇట్లాకాదు వీళ్ళని సాధించే మార్గం దౌర్జన్యమే! బైటికి వెళ్ళి టాపుపైకి చూశాను. స్త్రీలందరూ నిద్రపోతున్నారు. ఆమె మాత్రం మేలుకుని కూచుంది. దగ్గిరికివెళ్ళి చెయ్యి పట్టుకుని మెల్లిగా లాగాను. వెనక్కిలాక్కుంది. నడుంచుట్టూ చేతులు వేసి గారాబంచేసి రమ్మన్నాను. వెనక్కి జరిగింది. నాకు చాలా కోపమొచ్చింది. ఇంత ఇష్టంలేంది నన్నెందుకంత మోసపుచ్చాలి? చప్పున జుట్టుపట్టుకుని కిందికిలాగాను. చెక్కమీదికి జారింది. మెడపట్టుకుని ఒక్కతోపు తోశాను. మోకాళ్ళమీద పడ్డది. వ్యవధానమివ్వక వెంటనే లోపలికి తోశాను. తెప్పరిల్లడానికీ, అరపడానికీ వ్యవధిలేక గదిలో చెక్కలమీద పక్కగా పడ్డది. వెంటనేవెళ్ళి వెల్ల కిలాతిప్పి చంకలదగ్గర చేతులు అదిమి మోహంతో ఆమెను సమీపించాను. చేతులతో బలంగా తోసింది నన్ను. అభ్యంతరమేమో కనుక్కునే వీలులేదు. ఏంచెయ్యను? ఈ పెంకెతనానికి, అన్యాయానికి కోపం ఎక్కువవుతోంది నాకు. నా బలమంతా వుపయోగించి, ఆమెచేతుల్ని విరిచి, అదిమి ఆక్రమించుకున్నాను. కాని

బలమైన ఆ చేతులు నాకొక పట్టాన స్వాధీనమౌతాయా? ఆ చీకట్లో ఇ
అమ్మాయీ నేనూ భీమకీచకులవలె మల్ల యుద్ధం మొదలుపెట్టాము. అ
రొట్టెల బలం, వరి అన్నంగాణ్ణి ఎంత మొగాణ్ణైతేమాత్రం గెలవగలనా
చెయ్యలేక రోషమెచ్చి, తలకాయి చెక్కల్ని వేసి కొట్టాను. నా చేతుల్ని
చేతుల్తో విడతీసి పట్టుకుని, ఇంక యేంచేస్తావని చూస్తోంది, కళ్ళమీద
జుట్టులోంచి. చప్పున చేతులు వదుల్చుకొని మళ్ళీ కలియపడ్డాను. వా
మధ్య మధ్య మెల్లిగా ఏవో అంటోంది తన భాషలో! తిట్లేమోనని
సిగ్గేసింది. మీద కూర్చున్న నన్ను తోసేసి లేవబోయింది. ఇంక నాశక్తి అ
తోచింది నాకు. ఇంక అన్యాయయుద్ధం ప్రారంభించాను. ఇష్టమొ
బూతులన్నీ నోటినిండా తిట్టుకున్నాను. ఆ పడవ చెక్కలన్నీ విరిగి
వూగాయి. యామైతేనేం నల్లులన్నీ చచ్చివుంటాయి. కింద అసహాయ
పడివున్న ఆమెని జుట్టంతా పీకాను. బుజాలూ, చెంపలూ రొమ్ము కొరి
గోళ్ళు గుచ్చాను. రెవిక ఒక్కవూపుతో చించి ఆ వక్షాన్ని చూసి జయ
మోగించి నవ్వాను. నేను చేసిన గాట్ల రక్తం నా నోట్లోనే చిమ్మింది. అర
మాట్లాడదు వూరికే పెనుగుతుంది. ఆ మొద్దు భాషలో ఏమిటో తిడుతు
వివస్త్రఐన ఆమెని చూడగానే, నిగనిగలాడే ఆమె తొడలూ, అంటుకుని
ఆమె నడుమూ, చూడగానే నాకు మళ్ళీ కోపం

పోయి కామమెక్కువయింది. మళ్ళీ చివరిసారి గట్టిగా ప్రయత్నించి, మెలి
బిగబట్టిన అమె చేతుల్ని కాని, కాళ్ళనిగాని కదిలించలేక ఎంత ప్రయత్నించి
వుండవలె ఆమె అంతా దొర్లడంచేత నిరాశపుట్టి నిస్సహాయుణ్ణ
చూస్తోకూచున్నాను. నా వుధ్రుతం తగ్గి పశువు వలె ప్రవర్తించిన నా క్రూరత్వా
లజ్జాహీనత్వానికి నేను సిగ్గుపడి, ఆమెకి మొహం చూపలేక బైటికివచ్చా
కాని ఆమెమీది కోపంపోలేదు. తలుచుకున్నప్పుడల్లా నాకు మండిపోతో
ఇంతలో ఆమె సొమ్మేం పోయింది? అనే భావం వదలదు. పడవ ఆగింది
దూకేసి వెళ్ళిపోయి నాను వూళ్ళోకి. వూరిపేరన్నా యెవర్నీ అడగలేదు. ఆమె
ఆమె యేమయిందో! రెవికా, చీర, లేదంటావా నేనేం చెయ్యను?

* * *

# మచ్చలు

పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు భవానీరావు 'డ్యూటీ' మీద వెడుతోవుంటే, నేనూ వెళ్ళాను. బ్రాహ్మణ వీధులలో చిన్న పురాతనపు పెంకుటిల్లది. దానిముందు పెద్దగుంపు పోగయింది. పోలీసుజవాను అడ్డం నుంచుని ఎవర్ని లోపలకి పోనివ్వటంలేదు. మేమిద్దరమూ నడవాలోంచి లోపలికి వెళ్ళాము. కిటికీకింద మూలనున్న పెద్ద నవారుమంచంమీద ఆ పిల్ల శవం పడివుంది. మాసిపోయిన చంగావి చీరా, నల్లని రెవికా రక్తంతో తడిసి వున్నాయి. మెడకింద వాడు పళ్ళతో చీల్చిన గాయం కనపడుతోంది. ఎరిగిన వాళ్ళెవరిలో అంత చిన్నపిల్లను నే నెన్నడూ చూడలేదు. ఆ అమాయకమూ, విశ్వాసమూ, ఆశ్చర్యమూ కళ్ళు మూతలుపడివున్న, ఆ చిన్న పెదవి వొంపులో, ఆ గడ్డం కొనలో, ఆ కనుబొమ్మలు కలుసుకోడంలో నాకు కనపడ్డాయి. నిద్దట్లో భయమేసి ఏడుస్తున్నట్టే ముద్దుగా జాలిగా వుంది. భవానీరావు నోట్సు తీసుకుంటున్నాడు. నన్ను బాధించే జాలిని భరించలేక బైటికి వెళ్ళాను.

అరుగుమీద కూచున్న ఒక కుర్రాడి చూపు నన్నతనివేపు కనిపెట్టి చూసేట్టు చేసింది. అతని మొహంలో విచారమూ, నిరాశా, ద్వేషమూ చెప్పలేనంత గాఢంగా కనబడుతున్నాయి.

"ఎవరు నువ్వు ?"

నామాట నిర్లక్ష్యంచేసి "వాణ్ణేం చేస్తారండీ ?" అన్నాడు.

నడవాలో కూచున్న కైదీవంక చూశాను. అక్కడ జరిగే వ్యవహారమంతా తనకేమీ సంబంధం లేనట్టూ, తనేదో తన తపస్సులోనో యోగంలోనో వున్నట్టు కూచుని వున్నాడు.

"మీరు పోలీసులేగావును. అందుకని అడిగాను. అయినా వా
చేస్తేమాత్రం మీకేం పట్టింది. మీ పని మీరు చేసుకు వెడతారు."

అని వూరుకున్నాడు. అతని మాటల్లో బాధా అణుచుకుంటు
వంటి మహావిచారమూ, చూసి ఆశ్చర్యపోతో నుంచున్నాను. మళ్ళీ అత

"వాణ్ణేదో చేస్తారు తప్పదు. ఉరి తీస్తారేమో! కాని వాణ్ణిప్పుడేం
ఏం లాభం ? పోయినప్రాణం, మధురమైనదీ, అమాయకమైనదీ. ఆ ప్రా
తిరిగిరాదుకదా, ఆమె మళ్ళీ మెల్లిగా దీనంగా, నడుస్తో, బెదిరి బెదిరిచూ
ఇంక కనపడదు కదా ? ఎవరన్నా ఒకరు దయగలవారు తనకోసం
కంపపడేవాళ్ళు ఈ లోకంలో వున్నారా అని వెతికివెతికి, కనపడక, నిరా
పరలోకాన్ని వెదకబోయింది. ఇప్పుడు అంతా మిగిలిపోయిం తర
అందరూ కనికరం చూపేవారే!

"అన్యాయం జరిగిందనేవాళ్ళే! కాని ఆరేళ్ళనించి వాళ్ళ కళ్ళము
ఈ హత్య జరుగుతో వుంటే, ఒక్కడూ - ఒక్క ఆడది-ఒక్క దయగల మ
మాట్లాడినవాళ్ళు లేరు. శవంమీద వున్న కరుణ వీళ్ళకి మనుషులమీ
వుండదు. మీరందరు ఇప్పుడు-హత్య జరిగింతరవాత వొస్తారు, ఘనులమ
ఏం చేస్తోందో యీ పోలీసు సిబ్బంది అంతా ఇన్ని రోజులూ! బతికివున్నప్పు
కాపాడేందుకు ఒక్కరూ కనపడరు, శవం చుట్టూ రాబందుల్లాగు వాల్తారయ
ఇదంతా వాణ్ణి వురితీసేందుకు, ఈ అట్టహాసం ! ఏం లాభం ? ఏం న్యాయ
ఆ పిచ్చివాణ్ణి చంపి? వాడికేం తెలుసు ?" అన్నాడు.

"వాడికి పిచ్చా ?"

"పిచ్చా! ఏమో! నాకు తెలీదు. మీ డాక్టర్నడగండి" నేనింకా అ
బోతుండగా, చివాలునలేచి గుంపు వెనక్కిపోయి మాయమైనాడు.

ఆవాళ సాయంత్రం కాలవొడ్డున చాలాదూరం షికారువెళ్ళి ఇంటి
తిరిగివస్తున్నాను. ఆకలివేస్తోంది. వంటఐ సిద్ధంగానే వుంటుంది. గాని, ఇ
చేరగానే మెతుకులురావు. కాళ్ళు కడుక్కుని, మడిపంచకట్టి, సంధ్య వార్చిన



నటిస్తేనే కాని, మా అత్త అన్నం గిన్నె చాయకు పోదు. నా అదృష్టము కొద్దీ, ఏ మేనమామ సవితితల్లి మరది తమ్ముడో నామీద ప్రేమచాత వొచ్చి మడిగట్టి ముక్కు మూశాదంటే, పదిగంటలకన్నా తిండి దొరికినట్టే. అదేమి ప్రారబ్దమో మా యింటికి వొచ్చిన అతిథులందరికి, మొదట ఆచారమూ, భక్తి అధికమౌతాయి. రెండోది ఆకలి మందగిస్తుంది. కాని భోజన తత్పూర్వమే ఆమంధం, భోజన ప్రారంభంలోనే ఆమందం మాయమై, చప్పున మొదట ఆజ్యధారతోనే జఠరాగ్ని భగ్గుమని, సమస్త పదార్థాలనీ ఆహుతి చేస్తుంది. నాకు మారు వడ్డనకన్నా మిగలకండా.

తదియ చంద్రవంక రక్తంతో తడిపిన వంకర కత్తిలాగు పడమట జారుతోంది. గాలి రివ్వున చెట్లనన్నిటిలోంచీ దూసుకుపోతోంది. కాలవ రెండోవొడ్డున శ్మశానంలో శవం కాలిపోతోంది. ఎగరకొట్టే ఆ గాలిలో నాలికలవలె ఎర్రని జ్వాలలు చితిమీది నించి లేచి, పక్కనున్న నలుగురు మనుషులని కూడా అందుకోవాలని చూస్తున్నాయి. ఆ పిల్ల శవమే అయి వుంటుంది. పొద్దున్న నేను చూసిన, ముడతలు లేని ఆ చిన్న నుదురూ, ఏడుస్తున్న ఆ పసిబిడ్డ నోరూ యింక లోకంలో యెవరికి ఎన్నటికీ కనపడవు. అంత అందంగా హృదయాన్ని కరిగించేటట్టు అట్లాంటి చూపుని, మెత్తదనాన్ని అందాన్ని కల్పించి ఇట్లా నిర్లక్ష్యంగా నాశనం చెయ్యడంలో యీ సృష్టి వుద్దేశ్యమేమిటో? లోకాన్ని మిరుమిట్లు గొలిపిన సౌందర్యవతులు అహల్య, ట్రాయ్‌హెలెన్, క్లియొపాట్రా, ద్రౌపతి, నూర్జహాన్, వీళ్ళందరి సౌందర్యమూ ఇట్లానే కాలిపోయింది. చీకిపోయింది, మన్నూ బూడిదా అయింది. ఎందుకో అట్లా ! ఈశ్వరుడే సుందరుడూ, ఆనందమయుడూ ఐతే, లోకమంతా యిన్ని వికార రూపాలెందుకో, రూపాలేకాదు-మనసులు, ఆత్మలూ-అన్నీ అవే-ఎక్కడో ఒక్క సుందరమైన ముఖమూ- దృష్టి, హృదయమూ వుంటే, అవి ఇట్లా నలిగి, చిరిగి, నాశనమౌతాయి. నా గుండెల్లో చెప్పలేని దిగులు ప్రారంభించింది.

కాలవ పక్కన కూచున్నాడు ఎవడో! ఏడుస్తున్నాడు. ఆగాను, ఆ సన్నని వెన్నెల ఒకవేపూ ఆ చితిమీది యెర్రనివెలుగు రెండోవేపు ముఖం మీద

పడుతోంది. వెర్రిచూపు, వొళ్ళంతా తడిసింది. వెక్కి వెక్కి ఏడుస్తు
పొద్దున్నటి కుర్రాడు. నా శవంకూడా ఆ విధంగా తగలపడే రో
కళ్ళయెదట భావించుకుంటున్న నాకు ఆ సమయంలో నా దురభిమా
అధికార గర్వమూ, విద్యాధిక్యతా అన్నీ పోయి, సమస్త జీవరాసుల
సమానత్వం తటస్థించినట్టు తోచింది. ఆ అబ్బాయి దగ్గరికి వెళ్ళి, బుజ
చెయ్యేసి-తమ్ముడూ! ఆ బాధ యేమిటో నాతోటి చెప్పరాదూ?" అని ద
అడిగాను. వెంటనే హృదయ కుహరాలు విడిపోయినట్టు-

"కాలిపోతోంది. పోతూంది కాలిపోతూంది" అని బిగ్గరగా ఏ
అతని చెయ్యి పట్టుకుని దూరంగా నడిపించుకుని తీసికెళ్లాను. చంద్రు
మించాడు. నక్కలు కూస్తున్నాయి, కాలవనీళ్లు తూముక్రింద నుంచి
లబ' శబ్దంచేస్తో పోతున్నాయి. చీకట్లో భయంలేక కీచురాళ్ళు శబ్దం చేస్తున్నా

"సంగతేమిటి ? ఆ పిల్ల నీకు బంధువా ? ఇట్లా రహస్యంగా యె
కేడుస్తావు ?"

అప్పటికి పొల్లివచ్చే విచారాధిక్యత తగ్గింది. కన్నీళ్ళు తుడుచుకు
ఈ కథ చెప్పాడు. నా ఆకల్నీ, భార్యనీ, మెంతి పెరుగునీ, కంది పచ్చ
బంధువుల్నీ మరిచి విన్నాను- ఏ రాత్రిదాకానో.

"వాళ్ళది బీదకుటుంబం. ఆ పిల్ల ప్రతిదినమూ ఇంటికి మ
వొచ్చేది. నా భార్య ఆమెతో సాధారణంగా సరసాలాడుతో దయతో హె
చేస్తో వుండేది. నేనూ అక్కడ వుండటం తటస్తించినప్పుడు తమాషాకి మాట
కలిపి నవ్వేవాణ్ణి. ఆమె చక్కని చిన్ననవ్వు నవ్వేది. ఆ నవ్వు చూడాలనే సరదా
ఏదో ఒకటిచెప్పి నవ్విస్తాను. ఒకరోజు ఆమె బుగ్గమీద మచ్చతో మా ఇం
వొచ్చింది. నా భార్య అదేమిటని అడిగితే, సిగ్గుతో మాట తడబడి
మంచంకోడు తగిలిందనిచెప్పి తప్పించుకోవాలని చూసింది. నా భార్య వొద
ఏమిటో చెప్పమని ఆ మచ్చని పట్టుకు పరియాచకాలాడుతోంది. నే
వెళ్ళాను.



"దుర్గమ్మా-"

"ఆ పిల్ల పేరు దుర్గమ్మ.

"దుర్గమ్మా వారంరోజుల కిందట దీని భుజంమీద ఎర్రనిమచ్చ ఒకటి పడ్డది. నీళ్ళు పోస్తో వీళ్ళ అమ్మ అదేమిటే అని అడిగింది కూడాను. అదెట్లా వొచ్చిందో అడుగు" అన్నాను.

నా భార్య "మరీ అట్లానా" అని పెద్దనవ్వు నవ్వింది. దుర్గమ్మ బుగ్గ చూసి, దుర్గమ్మ వుడుకుకుని, కళ్ళనీళ్ళు కుక్కుకుంటో, మజ్జిగ తీసుకోకుండానే వెళ్ళిపోయింది.

"తరవాత-ఆరోజు అట్లతద్ది రోజున-నాభార్య ఆ పిల్లని వుయ్యాల మీద కూచోబెట్టి వూపిస్తో నడుం దగ్గర పట్టుకునేటప్పటికి నెప్పి అని అరిచింది ఆ పిల్ల. రెండుమూడుసార్లు అట్లానే జరిగేటప్పటికి అందరు పిల్లలూ చేరి ఏమిటో చూపమన్నారు. ఏమో కురుపులనీ, దెబ్బలనీ, చెపితే నమ్మక చీరె బలవంతంగా తొలగించి చూశాను. ఎర్రని పెద్ద మచ్చ కనబడ్డ"దని నా భార్య చెప్పి ఒకటే నవ్వింది.

కొన్నాళ్ళ తరవాత నాలుగురోజులు మజ్జిగకి రాలేదు. ఏమో అనుకున్నాము. బావి దగ్గిర నా భార్యకి తలకి కట్టు కట్టుకుని దుర్గమ్మ కనపడి, పిలిచినా రాకుండా వెళ్ళిపోయింది. రెండురోజుల తరవాత ఆ కట్టుతో వొచ్చింది మామూలుగా!

"రావటంలేదేం? దుర్గమ్మా!" అన్నాను.

"నవ్వి "కట్లు కట్టుకున్నానుగా!" అంది.

తమాషాకి కట్టుకుందనుకున్నాను.

"మరి విప్పందే వొచ్చావేం?"

"విప్పిందాకావుంటే, మజ్జిగలేక ఈ లోపున కాకచేసి చస్తామని భయమేసింది, అదిగాక అన్నంలోకి ఇంకేం గతిలేదు."

"ఆ కట్టు తియ్యి"

"అమ్మో! ఆశే!"

"ఏముంది ?"

"రత్నాలన్నీ వొలికిపోవు ?"

"నేను రెండేరుకుంటాను."

అని చప్పున కట్టు లాగేశాను. బిత్తరపోయింది, ఆ మనిషి. రె బుగ్గలమీదా, రెండు వరసలుపళ్ళు దిగపడ్డ గంట్లున్నాయి. కళ్ళవెంట పెట్టుకుంటో కొంగు ముఖంమీద కప్పుకుని దుర్గమ్మ పారిపోయింది గాయం చూస్తే నాకు భయం, జాలి, ఆశ్చర్యం, ఇన్ని కలిగాయి పో చూడలా, వాడే రత్తయ్య, ఆమె మొగుడు. వాణ్ణి నేను మొదటి యెరుగుదును. చిన్నప్పుడు వాణ్ణి పిచ్చిరత్తయ్య అనే వాళ్ళం. ము చిన్నప్పుడు కూడా ఆటలాడడు, నవ్వడు, గంతులెయ్యడు. గుడ్ల గుబ చూస్తో కూచుంటాడు. వాణ్ణి చూసి అందరికీ అసహ్యం, ఏదో ముది కనపడేవాడు. పెద్దయినాక మే మెవరం వాడితో మాట్లాడ్డం మానేశా వాడూ ఒకరితో మాట్లాడడు, ఒకరి జోలికిరాడు. పనిచెయ్యడు. కూచుంటాడు చుట్ట కాలుస్తో.

వాడీ ప్రకారం, ఆ పిట్టలాగుండే దుర్గమ్మను,ఎందుకు బాధించా అని ఆలోచించాను. వాడేనా? వాడుకాక ఇంకెవడు? దుర్గమ్మ వంటి వుండడం అధికమైన అదృష్టం. అతనికి క్రోధం తెప్పిస్తుందని అనుకో కూడా పాపకరమైన విషయం. దుర్గమ్మనే అడుగుదా మనుకున్నాను. అంతవరకు నా భార్య వెనకనుంచుని పరిహాసాలేగాని, ఎన్నడూ నేనా పిల్ల సరిగా మాట్లాడలేదు. అందుకని నా భార్యనే అడగమన్నాను.

ఒకరోజు దుర్గమ్మ తండ్రి వాళ్ళ వూరునుంచి దుర్గమ్మని చూడ్డా వొచ్చి మా నాన్నగారి దగ్గిరికి వొచ్చాడని తెలిసింది. మా నాన్నగారు మునస



ఆ వూరికి పెద్దా. ఆయన మా నాన్నగారితో, తన కూతురికి పుట్టింటికి రావాలని వున్నదనీ, రత్తయ్య పంపడంలేదనీ చెప్పుకుని ఏడ్చాట్ట. తరవాత వారంరోజుల్లో రత్తయ్య పెళ్ళాన్ని కొడుతున్నాడని పుకారుపడ్డది. నాకెందుకో ఆ పిల్లసంగతి మొదటినుంచి నా స్వంత వ్యవహారంగా కనపడేది. పుకారు ప్రబలమయింది. నాకు దుర్గమ్మ కనపట్టంలే. నాకు జాలివేసి ఆ పుకారు ఎట్లా వొచ్చిందని విచారిస్తే, రత్తయ్య ఇంటి పక్కనవున్న నాగన్న పుట్టించాడని తెలిసి వాణ్ణి దబాయించాను. వాడు రుజువు చేస్తానన్నాడు. మర్నాడు తెల్లారకట్ట ఒచ్చి, నన్ను లేపి రత్తయ్య ఇంటిపక్కన నుంచో పెట్టాడు. లోపల్నించి జాలిగా మూలుగు వినపడుతోంది. క్రమంగా పెద్దదై ఏడుపుగా మారింది. కానికోపంతో కేకలులేవు. మళ్ళీ విన్నాను. నేనో విధంగా అర్థం చేసుకున్నాను. పట్టరాని నవ్వు వొచ్చింది నాగయ్య యేమిటంటాడు.

"ఏమిటా? అది కొట్టడంరా? నీ మొహం? నీకూ పెళ్ళిగానీ, ఆ మూలుగు అర్థమౌతుంది. ఇట్లాంటి వెధవ పుకార్లు పుట్టించకు. తన్నేను." అని వాణ్ణి తోపుతోసి ఇంటికి వొచ్చి నిద్రపోయినాను. కాని దుర్గమ్మ వొంటిమీద చూచిన గాయాలూ, ఆ పిల్ల కళ్ళల్లో చూసిన బాధా నా మనసుని కలవరపెట్టి, ప్రశ్న లడుగుతోనే వున్నాయి.

వారంరోజుల్లో దుర్గమ్మ మా ఇంటికి వొచ్చింది. అన్నాళ్ళు ఎందుకు రాలేదంటే జవాబు చెప్పలేదు. అప్పుడు నేనూ నా భార్యా కలిసి అడిగాము. నిన్ను రత్తయ్య కొడతాడా?" అని. కొడుతోవుంటే, వాడు మానేటట్టు చేస్తానన్నాను. ఆ మాటలకి చెప్పరాని భయమూ, సిగ్గూ కలిగి దుర్గమ్మ 'లేదు లే'దని, ఏదో వికారంగా అని వూరుకుంది. ఎంత అడిగినా చెప్పలేదు. అటు తరువాత దుర్గమ్మను చూసినప్పుడల్లా నవ్వొచ్చేది. 'వాళ్ళిద్దరు సరసాలు అంత తీవ్రంగా వుంటాయిగావును అనుకున్నాము. "ఏం దుర్గమ్మా! ఎక్కడన్నా కొత్త మచ్చలు!" అని మొదట్లో నా భార్యా తరవాత నేనూ అనడం మామూలయింది.

నా భార్య ప్రసవానికి పుట్టింటికి వెళ్ళింది.

ఒక సాయింత్రం మా దొడ్లో దుర్గమ్మ గోంగూర కోసుకుంటూ వు
నేనక్కడికి వెళ్ళడం తటస్థంచింది. దడి దగ్గిరగా తెల్లవి పచ్చవీ, చంద్ర
పూలు వికసించాయి. ఎండలో వాడిలిన గోగుపూలు సాయంత్రపు గా
ప్రాణాల్ని నింపుకొంటున్నాయి. కొట్టంముందు కట్టిన ఆవులు నన్ను
మెడలుచాస్తున్నాయి. ఉండుండి అంబా అని పిలుపు వినపడుతోంది.
శాంతి అప్పుడే భూమిని అవరించింది. దుర్గమ్మ వొక్కతా గోగుచెట్ల నడు
దిగులుగానుంచుని ఒక్కొక్క అకే వొళ్ళో వేసుకుంటోంది. నా హృదయ
అపరిమితమైన దిగులు అవరించింది. ఆమె దగ్గరికివెళ్ళి,

"ఏం కొత్తమచ్చలు లేవూ?" అన్నాను.

సిగ్గుపడక, చిన్న నవ్వుతో "లేవండీ" అంది.

నా మనసులో కొత్త వికారం వుదయించింది. భార్య ఇంట
పోవడమే కారనమనుకుంటూ ఇంకా దగ్గిరగా అడుగువేసి, కొంటెగా,
మచ్చలు లేనేలేవా?" అన్నాను మళ్ళీ.

"ఉంటే, కనపడవూ" అంది ధైర్యంగా.

"కనపడనిచోట్ల వున్నాయా?"

కళ్ళూ తలా తిప్పేసింది. ఆ నిమిషాన ఆ పిల్లమీద నిష్కారణ
జాలీ, వున్నతమైన ప్రేమా కలిగాయి. ఆ చూపులో యితరుల సహా
అడిగే జాలివుంది, నేను చెయ్యగల సహాయం ఒక్కటే కనపడ్డది నాకు
సమయాన ప్రేమకీ, కామానికీ, జాలికీ ఎంత సన్నిహితమో! మోకాళ్ళ
ఎగదీసికట్టిన ఆమె చీరా, రొమ్మును దాచడానికి శ్రమపడే ఆ రవిక, గా
వూగుతున్న ఆమెజుట్టూ, నన్ను వెళ్ళి పోనీక ఆటంక పెట్టాయి. ఈ గోం
ఒక్కొక్క ఆకే కోసి, ఏరి, వొండి, ఆ చీకటి బూజు యింట్లో ఆ మూ
ముంగి వెధవకి తినిపిస్తుంది. ఒక్క ఆకన్నా మిగల్చక తిని, ఈమె
తలెత్తి చూడక లేచిపోతాడు వాడు. నా హృదయంలోని ఆ కరుణాభా
భరించలేక పోయినాను. ఎట్లా సంతోషమివ్వగలను, ఆ బేలహృదయు



"మచ్చలేవి? చూడనీ" అని ఆమె బుజంమీది రవికను పక్కగా లాగాను. దుర్గమ్మ మెల్లగా నా వేళ్ళను తొలగించి మళ్ళా కప్పుకున్నది. అదే పట్టుదలతో రెండోచేతి పక్కన చూశాను.

అక్కడో పెద్ద మచ్చ వుంది. ఇంకా కొంచెం కిందగా యెత్తుగా మొదలు పెట్టిచోట ఇంకో మచ్చ వుంది. "పాపం, దుర్గమ్మా!" అని ఆమె తలని నా రొమ్ముకి అద్దుకున్నాను.

"ఎందుకు నా మచ్చలజోలి నీకు? ఎప్పుడూ నవ్వుతావు? వొళ్ళంతా అవే." అని మోకాలిమీద చీరెతీసి చూపింది. నేను చప్పున యింకా పైకి లాగి "ఇంకా లేవా?" అన్నాను. తలయెత్తి నావంక తెల్లబోయి చూస్తో నుంచుంది. ఎఱ్ఱని పడమటికాంతి ఆమె కళ్ళమీద మెరిసింది. నేను ఆమె బుజాన్ని పట్టుకుని వొంచబోయినాను. అప్పుడు కలిగింది జ్ఞానం ఆ అమాయకపు కళ్ళల్లో. భయంతో-వొణుకుతో-ఆ చిన్న మొహం-కాలిపోతున్న ఆ చిన్న మొహం-చెప్పలేను ఆ బాధ మెడకాయ తెగుతున్న కోడి కళ్ళలోకి వచ్చే చూపు-

"నీకు చెల్లెల్ని, అన్నయ్యా, కొరక్కు-ఆ పని తగదు నీకు. నన్ను కొరక్కు. నీకు ఆ బుద్ధికూడదు. నీ కాళ్ళు పట్టుకుంటా, కొరక్కు" అని సన్నగా కీచుమని అరిచింది.

నా మోహం పటాపంచలయింది. భరించలేని సిగ్గుతో, జాలితో, ఆశ్చర్యంతో వెళ్ళిపోయినాను. నామీద, నా కామంమీద, పరమ అసహ్యం కలిగింది. ఆనాటినించి ఇంతవరకు పరాయి ఆడదాన్ని తాకలేదు. ఆచూపు నన్ను దయ్యంవలె వెంట తరుముతోంది. ఆ కళ్ళు, దీనమైన ఆ కళ్ళు-ఎవరితోను చెప్పుకోలేని బాధతో కుంగిపోయిన, ఆ పాపలు, రక్తధారలు కార్చిన ఆ పాపలు-బొగ్గయిపోతున్నాయి. తననే కాకుండా, లోకాన్నంతా నాకు చెల్లెళ్ళని చేసింది దుర్గమ్మ తల్లి కాలిపోతోంది.

ఆలోచించాను, కొరకవొద్దని అరిచిందేమిటి? ప్రేమ అన్నా, లాలన అన్నా, దుర్గమ్మకి కొరకడంతో ప్రారంభమని అభిప్రాయం. వాడూ ఆ రత్తయ్య కారణం. వాణ్ణి వెళ్ళి "ఇదేం, రోగంరా!" అని తందామనుకున్నాను. కాని

నాకెట్లా తెలిసిందని వాడనుమాన పడడా? వాడి భార్యమీద అట్లాంటి కొ
పైగా వాణ్ణి యామని తన్నను? ఏం చెయ్యను? దుర్గమ్మని వొచ్చే
ఇంటో వుండమంటే, పారిపొమ్మంటే, లేక నేను యక్కడన్నా ఆమెని
పెడితే-ఇట్లాంటి చాతకాని ఆలోచనల్ని చూసి నేనే నవ్వుకున్నాను.

దుర్గమ్మ మాయింటికి ఇంక రాలేదు. ఒక్కసారి ఆమెతో మాట్లా
వుంది. నా భార్య నెలరోజులయిం తరవాత వొచ్చింది పుట్టింటినించి
ఆమె చాత కబురంపి పిలిపించాను దుర్గమ్మని.

"దుర్గమ్మా, రత్తయ్య రాక్షసి, నువ్వా బాధలు పడలేవు. ఎక్క
వెళ్ళు. నేను సహాయం చేస్తాను.

"నేనా? ఎక్కడికన్నా వెళ్ళనా? సంసారం వొదులుకుని!
మాటలు మాట్లాడుతున్నారు. నేనెందుకు వెళ్ళాలి?" అని ఒక్క వి
వెళ్ళిపోయింది.

నాకు దుర్గమ్మ మీద కోపం వచ్చింది. సహాయం చెయ్యపోతే
కాని నేను ప్రయత్నించిన దుర్మార్గమూ ఆమె విశ్వాసాన్ని పోగొట్టు
సమాచారమూ చక్కగా మరచిపోయినాను.

రత్తయ్యమీద వూరంతా పుకార్లుగా వున్నాయి. అతనికి పిచ్చి
దంటున్నారు కొందరు. ఇద్దరు ముగ్గురు ఈడిగ ఆడవాళ్ళని వెంబ
బలవంతంచేసి పట్టుకుని కరవబోతే, దొంగ అనుకుని తన్నారుట. దు
రెండుసార్లు ఇంటోంచి పారిపోతే వూరివాళ్ళు లాక్కొచ్చి దిగద్సారు.
సంగతులన్నీ వింటున్నా నేను జోక్యం కలగచేసుకోలేదు. నాకేం? అ
తృణీకరించిం తరువాత మళ్ళీ ఆమె క్షేమం కనుక్కుంటానా?
అభిమానపడ్డాను.

ఒకరోజు రాత్రి నా పడకగది తలుపు కొట్టారు యేవరో. తెరిస్తే లో
వొచ్చింది దుర్గమ్మ. నా భార్య పందిరిపట్టె మంచంమీద చామంతి పూ
పట్టు దిండుమీద తల పెట్టుకుని నిద్రపోతోంది. నేను కుర్చీలో పడు
పతివ్రతల కథలు చదువుకుంటున్నాను. కొత్తగా పుట్టిన మా పాప



అమ్మమ్మ యిచ్చిన వుయ్యాలతొట్టెలో పడుకుని, దీపం కేసి చేతులు జాచి వూకొడుతున్నాడు. సాంబ్రాణి వొత్తులు కొన వరకూ వెలుగుతున్నాయి. మా గదినీ, మాసౌభాగ్యాన్నీ గావును చూస్తోనుంచుంది. దుర్గమ్మ.

"ఈ రాత్రికి, మీ యింటో... ఆ వసారాలో... యెక్కడైనా సరే పడుకోనియ్యండి" అంది కష్టంగా.

కారణం తెలుసుకోవాలనే ప్రబలమైన నా కోర్కెని దిగమింగుకుని, "దానికేం?పడుకో. మీ ఇంటో వీలులేదా?" అన్నాను. గుడ్ల నీళ్ళు కుక్కుకుని మాట్లాడలేదు. వరండాలో మంచం జంపకానా వేసి పడుకోమన్నాను. నా వెంటవొచ్చి మంచంమీద కూచుని వెళ్ళబొయ్యే నా చెయ్యి పట్టుకుని, కళ్ళనద్దుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. కాని ఏమీ మాట్లాడదు, ఎంత అడిగినా-"నిర్భాగ్యురాలిని, నా సంగతెందుకు-వెళ్ళిపడుకోండి" అంటుంది. యేం చెయ్యను?

జీవితంలోని దురదృష్టవంతులు, మన పక్కనే వుంటారు. మనలోనే, స్నేహంగా తిరుగుతో వుంటారు. బాధపడుతో గాయాలు పడుతో, మన కళ్ళయెదుటనే అకాల మృత్యువువేపు నడుస్తోవుంటారు, మనం గుర్తించం. గుర్తించినా, మన ఆనందంలోంచి తప్పుకుని వాళ్ళకోసం చెయ్యి చాచము. చాచినా, సహాయాన్ని తీసుకోరు. సహాయం చెయ్యలేము. నిస్సహాయులం. సహాయం తీసుకోడం వారిచాతకాదు. దౌర్భాగ్యులు, నిస్సహాయులు, విచిత్రమైన లోకం-భయంకరమైన జీవితం-

"నేను కష్టపెట్టి, నలగకొట్టతలుచుకొన్న వాళ్ళకి నువ్వా, ఓరి అల్పుడా, నువ్వా సహాయం చేసేది! కానీ!" అని మొహాన నవ్వి నట్టుంటుంది, యెవరో రాక్షసి!

తెల్లవారి నేను లేచేముందే వెళ్ళిపోయింది.

రెండు రోజుల తరవాత ఒకనాటి మధ్యాన్నం, నేను వసారాలో పడుకుని అబ్బాయిని గిలిగింతలు పెట్టి నవ్విస్తూ వుండగా, దుర్గమ్మ వొచ్చి మంచం ప్రక్కన కూచుంది.

"అన్నయ్యా! ఆనాడు నన్నెక్కడికన్నా పొమ్మన్నారే! పోతాను. ఎక్కడికి పోను?"

అన్నా నన్నుమాటేగాని ఎక్కడికి పంపను?

"మీ అమ్మ దగ్గిరికో, అన్నయ్య దగ్గిరికో వెళ్ళకూడదా?"

"అయింది. మళ్ళీ లాక్కొచ్చాడు."

మాయింటో వుండమనడానికి ధైర్యంలేదు. రత్తయ్య వొచ్చి గల… మా నాయన వొప్పుకోడు. నేను మాత్రం అపవాదు పడగలనా?

"ఎక్కడన్నా నేను వుంచుతాను, ఈ వూళ్ళో."

"బతకనీడు."

ఇంకేం చెయ్యను?

ఆలోచించాను. యేమీ తోచలేదు. ఎందుకు న… బాధపెడుతుంది! పోదేమో అనిపించింది. ఆమె బట్టలూ, వొళ్ళూ, భరిం… వాసన వేస్తున్నాయి. నా పిల్లవాడి కెక్కడ పట్టుకుంటుందో ఆమెనించి …

"సరేలే, చూస్తాలే, దుర్గమ్మా వెళ్ళు."

కాళ్ళీడ్చుకుంటో వెళ్ళింది. అప్పుడన్నా నా కర్థం కాలేదు, ఆమె బాధ …

తెల్లవారేటప్పటికి చచ్చివుంది. రాత్రంతా ఆమె కేకలు మూలు… విన్నవాళ్ళే అంతా, ఒక్కరూ కదల్లేదు. కిటికీలూ, తలుపులూ, చెవు… మనసులూ, బిగించుకుని హాయిగా పడుకున్నారు. ఏం జరిగిందో ఎవరి… తెలుస్తుందా? ఎవరు చెపుతారు? వాడా? వాడేమి చెప్పడు. చెప్పినా అబద్ధ… ఆ కాలిపోయిన పెదిమలు యిదివరకు చెప్పలేదు. ఇంక చెప్పవు.

* * *

# ఒరేయ్ వెంకటచలం

నేను రైలుపెట్టె యెక్కీ యెక్కడంతో ఓ మూలనించి, 'ఒరేయ్' అని కేక వినపడ్డది.

నన్ను ఒరేయ్ అని పిలిచే వాళ్ళిద్దరే వున్నారు లోకంలో. వాళ్ళు నాకు ప్రేమాస్పదులైనందువల్ల సంతోషంతో తలెత్తి చూశాను. నాకేసి పరమానందంతో చూస్తున్నాడు. తెలిసినవాడు దొరికాడు కదా అన్నట్టు. ఆయనెవరో నాకు తెలీదు, నన్నేనా అని అనుమానపడుతున్నాను.

'ఇట్లారా, చోటుంది యిక్కడ' అంటున్నాడు పైగా.

ఇన్నేళ్లూ నన్ను వెలేశిన బంధువు డెవరన్నా దూరదేశంలో చూచిన ప్రేమచేత పలకరిస్తున్నాడా యేం? అనుకుని వెళ్ళాను. ఒక ట్రంకుని బల్లమీద నించితీసి, ఓ గుజరాతివాణ్ణి మనిషికి కావలసినంత స్థలమే ఆ క్రమించుకునేటట్టు తోసి నాకు చోటు చేశాడు.

'అట్లా చూస్తావేం? నన్నెరుగవూ?'

రైలెక్కగానే బంధువుడు దొరికిన నా అదృష్టానికి గావును, అందరూ నా వంక చూస్తున్నారు. లోకంలోకల్లా నాకు యిబ్బందైన విషయం రైలు పెట్టెలో అందరూ నావంక చూడడం.

ఈయన్ని 'నువ్వు' అనాలో 'మీరు' అనాలో తెలీదు. ఇంత పెద్ద రైల్లో యీ పెట్టె నాకు ఎట్లా తటస్థపడ్డది?

'ఏరక్కేం?' అన్నా.

'ఐతే నే నెవరు ?'

నా మీద అంత నమ్మకం లేకపోతే, నన్ను పిలిచి పక్కన కూచో పెట్టుకోమన్న దెవరు?-

ఏం చెయ్యను ?

'మరిచిపోయినాను'

'నిజం చెప్పు'

అసలు యెరగనేమో ?

'తెలీదు'

'ఈ డాబులకేం లే! నువ్వు నన్నెరక్కేం ?'

'ఐతే జ్ఞాపకం రావటంలేదు'

పెట్టెంతా ఆదిరేట్టు నవ్వాడు.

'నన్నెరుగవు నిన్ను నే నెరుగుదును'

'ఎవరో చెప్పు అని ప్రశ్న వేస్తానేమోననే ఆశతో అగాడు.నేను కొత్తచె కరిచినచోట చూసుకుంటున్నాను.

'నువ్వెవరో చెప్పనా ?'

చూస్తున్నాను. మతి సరిగా వుందా యీయనకి? అని. వొద్దని యెట్ల

'నువ్వు వెంకటచలం'

'కాదండీ, నేను సూర్యనారాయణని.'

'డాబులు కొయ్యకు. నువ్వు వెంకటచలం.'

'ఏ వెంకటచలం.'

'ఇంకెవడు ? కథలు వ్రాసే వెంకటచలం.'

'కాదండి ఆయన్ని నేనెరుగుదును'

'ఈ మాటలకేంలే? నన్ను నువ్వెరగవా?'

నన్ను ఎగాదిగా చూశాడు.

'ఒరే, యేమిట్రా ఆ కథలూ నువ్వూనూ'

'నాకు తెలీదండి ఆ కథల సంగతి.'

'ఆ సంగతి సరేలే................ జరిగాయే అనుకో జరిగినంత మాత్రాన వ్రాయ తప్పుకాదూ? భోజనం చేశామనుకో, తరవాత సంగతి కూడా వ్రాసుకుంటారా?'

'నన్నడుగుతారేమిటి ?'

'ఆ సంగతి సరేలే, వ్రాశావనుకో, యేమంటావు?"

"అర్థు సరేలే. వ్రాయవొద్దనలేదు. జరిగినవి వ్రాయడం ఎందుకు ?'

చూస్తున్నాను అర్థంగాక.

'పాపం, వాళ్ళ మనసులు నొచ్చుకుంటాయా లేదా ?' అన్నాడు, నిట్టూర్పు వి

'ఎవరి మనసులు ?'

'ఆ ఆడపిల్లలవి.'

'ఏ ఆడపిల్లలవి ?'





విసుక్కున్నాడు.

కొడతాడనుకున్నాను.

'అదేరా, ఏదో నిన్ను నమ్మి వొచ్చారనుకో. వొస్తే ? బట్టబయలు చెయ్యాలా ?'

'ఆడపిల్ల లెవరు ? నన్ను యిష్టపడి రావడమేమిటి ?'

అంత అదృష్టమా అనుకున్నాను, స్వగతంలో.

'తెలుసులేరా?' నీలో యేంచూసి వొచ్చారో?' అనుకున్నాడు నన్ను బాగా పరిక్షిస్తో.

'ఎవరూ రాలేదు. రారు.'

'మరి వొప్పుకుంటాననుకున్నావా! నాకు తెలుసులేరా?'

'బాగానే వ్రాశావుగాని, నువ్వు వ్రాసినవి ఒక లెఖ్ఖా జమా ! ఈనాడు అసలు రొమాన్సు అనేది వుందా ! ఒరే, యిప్పుడున్నదల్లా రొమాన్సు కావాలనే ఆశవల్ల పుట్టిన జార్యం. అంతేకాని చూడూ, ఈ కొత్త ఆడపిల్లలు-ఎవరి వెంటపడుతున్నారంటావు ? ఈ కొత్త కాలేజ కుర్రాళ్ళవెంట, కవిత్వాలూ, కథలూ వ్రాసే కుర్రకుంకలవెంట. వొరే ! కథ చివరిదాకా వ్రాసేందుకు కలం పట్టుకునే బలంలేదే, వీళ్ళకి ! కథలు వ్రాసినవాడు కథలోమల్లే చెయ్యగలడనే యీ వెర్రిగుంటల వుద్దేశ్యం ? పొడుగుజుట్టూ, ఫ్రెంచిమీసాలూ, స్నోలూ, వొల్లెవాట్లూ, ఇవీ ఈనాటి పురుషలక్షణాలు. చొక్కాకింద వెమికలకుప్పలు. ఏదీ నీ చెయ్యి? చూడు, ఏ మూలన్నా, ఒక్క రవ్వ కండ.........

కుయ్యి మని చెయ్యి లాక్కున్నాను.

'ఏం చేస్తున్నావురా, ఇన్నేళ్ళూ, ఇన్నాళ్ళూ? ఏమిటా పుస్తకం..... షా........అంతే షాలూ, లారెన్సులూ చదువుతున్నావు. నీ బతుకంతా, మరి యీ పుస్తకాలతోనే వూరేగు, ఆడపిల్ల లెందుకురా నీకు ? ఏం చేసుకుంటావురా ? వాళ్ళనీ విప్పి చదువుకుంటావా ? ఏంచేస్తారు రాత్రంతా 'షా' చదువుకుని, స్త్రీలకి స్వతంత్రం లేదని తర్కిస్తారా ? ఈ సంఘాన్ని సంస్కారం ఎట్లా చెయ్యాలా, ఏ కాన్ఫరెన్సులు పెట్టాలా, ఏం లెక్చర్లియ్యాలా అని యోచిస్తారు తెల్లార్లూ-ఒకే పక్కమీద కూచుని. ఓరి జోగుల్లారా ? ఎందుకురా స్వతంత్రం మీకు. ఓ మొగుడూ, ఓ పెళ్ళాం చాలర్రా మీ బుతుకులకి ?

ఆగాడు. చుట్టూ చూశాడు. ఎక్కడికన్నా పోదామని స్టేషను వొస్తుందేమోనని కిటికీలోంచి నేను చూస్తున్నాను. పోతే తంతానంటే....

'నీ యీడున్నప్పుడు ఇట్లా చూడు, నా జబ్బపట్టి చూడరా'

నాకు మొగవాళ్ళని తాకడం బావుండదు.

ఏం చెయ్యను ?

'ఇంకా వొత్తు-అంతేనా ?'

బిగ్గరగా నవ్వాడు.

'చూశావా ? నీ యీడున్నప్పుడూ, పరుగెత్తే దున్నపోతు తోక పట్టుకు లాగితే, దున్నపోతు ఆగేదిరా. మరి నువ్వు ఎన్నడన్నా దణ్ణాలు తీశావా? చెడుగుడు ? మరి ఏం చేస్తున్నావు ? ఓ మైలు పరుగెత్తుతావా ? పరీక్షలు పాసవుతున్నావు Letters వ్రాస్తున్నావు. రోడ్డుమీద ఆడపిల్ల కనపడితే వెంటపడతావు-మరి ఎవరన్నా పరుగెత్తకలవూ ? రాత్రిపూట మూడడుగుల గోడ దాటగలవురా ? ఇంకేం రొమా నీకు నీ మొహం.'

అది మహారాష్ట్రదేశం గనక తెలుగు తెలీదు గనక సరిపోయింది.

తెలుగు రైలుపెట్టెలో అట్లా అరిచి ఆ మాటలంటోవుంటే నన్ను !.......

'టెన్నిసన్ కవిత్వం. హానిబాల్ శౌర్యమూ, కృష్ణదేవరాయడి బలమూ, రఘువంశమూ, మీ కాలేజీ పార్లమెంటూ, స్వరాజ్యం- జపాన్ వాడితో నువ్వేరా పోట్లా

ఆగి చుట్టూచూశాడు. వాళ్లెవళ్ళన్నా పోట్లాడగలరేమో అన్నట్టు

'ఇంత చాతకాని వాళ్లు గనుకనే కొత్త థియరీలు పెట్టారు-'

'చూస్తోనే వున్నానురా, మీ వ్రాతలూ- అధ్యాత్మిక ప్రేమలూ, ప్లేటోనిక్ లవ్‌లూ, సానుభూతీ, పవిత్రతా, కళా వుపాసనా- మీ వ్రాతలట్లా వున్నాయి గనకనే మీ రాత లిట్లా యే

'వెంకటచలంగారు వాటిని వొప్పుకోరండి'

'నువ్వు వొప్పుకోవులే. కాని నువ్వుమాత్రం -విన్నావూ, ఆ షికార్లూనవ్వులూ, బోట్లమీదా రైళ్ళమీదా గెంతడాలూ....ఆడపిల్లల్ని రోడ్లమీద తిప్పడమెందుకు అలిసిపోవాలనా ? అవునులే. అంతకన్న చాతకానప్పుడు ఏం చేస్తావులే ?

'ఒరే నామాటవిని ఆ కథలు మానెయ్యి. ఎందుకురా నీ అనుభవాలూ నువ్వు నన్నెరుగుదువుగా !'

**'అవన్నీ వూహించి వ్రాసినవండి. ఆయన అనుభవాలు ఆయెన్నెరుగుదును నేను'**

'సరేలే ఎవరిముందన్నా బొంకుగాని, నా ముందుకాదు' నాకు తెలీని దేవీలే మహా మహావాళ్ళని చూశాను. ఏం తెలుసురా నీకు ప్రేమంటే ? నీకేం తెలుసు ? నన్ను చెపుతాను. ఎప్పుడన్నా మావూరు రా, నేను దాచిన వుత్తరాలు చూపుతాను. ఫొటో వున్నాయిరా ? నేనే నా కథలు వ్రాస్తేనా ? ఇట్లాంటి ఆడవాళ్ళా ? ఇంతంత కళ్ళు, జుట్టు, ఇంతంత.......'

వెళ్ళిపోతోంది ప్రవాహం. నుంచున్నాడు. ఆ జుట్టునీ కళ్ళనీ చేత్తో చూపి వర్ణిస్తున్నాడు. పెట్టెలోవాళ్ళు తెలుగువాళ్ళు హిందీఫిల్ముని చూసినట్టు



ఆనందిస్తున్నారు. ఒకళ్ళిద్దరు లేచి ఆడడానికి సిద్ధమయ్యేటట్టున్నారు. 'పాటపాట' అంటారు కొంతసేపు పోతే. ఇదేం ఖర్మ నాది?

'మీరెవరో చెప్పారుకారు ?'

'నేనా !' కూచున్నాడు. 'నన్నెరుగవూ ?'

'ఎరగను'

'ఎర్కేం. నేను యవ్వనంలోవుండగా ప్రతీ పత్రికలోనూ నా ఫొటో వెయ్యమని ఆ పత్రికల వాళ్ళని ఆశ్రయించే వాణ్ణా నీకు మల్లే! వాళ్లేనా గుమ్మంముందు పడివుండేవాళ్ళు, ఏమనుకున్నావో ! విన్నావుగా? వజ్రేశ్వరశర్మ నా పేరు ?'

'మీరా అండి ! చిన్న కుర్రాణ్ణి నేను, మీరు మా కాలేజీలో డిమాన్‌స్ట్రేషన్ ఇచ్చినప్పుడు.........'

నాకు జ్ఞాపక మొచ్చింది, ఆ పటం.

చెయ్యి కదిల్చినా, కాలు కదిల్చినా తాచుపాముల్లాగ పెనవేసుకునే నిగనిగలాడే కండలు చల్లని చర్మంక్రింద వుబ్బి కళ్ళను చెదరగొట్టే బలం........

అంత 'రాట్' ఆయన మాట్లాడినా నాకు అద్భుతమైన అభిమానం కలిగింది. శరీర బలానికి ప్రజలుయిచ్చే అప్రయత్నమైన గౌరవం.

ఎరుగుదువుకద ! మా కాలంలో నా ఈ షికార్లూ ఈ కవిత్వాలూ ఏమీలేవు. ఒక్కచూపు, ఒక్కమాట-చాలు-ఈ టీలకు పిలవడాలూ, యీ పేర్లులేని చీటీలూ, యీ పుస్తకాల్లో పద్యాలకి పెనసలుగీట్లూ, యీ గూఢకవిత్వాలూ, భావగీతాలూ, భావోద్రేక కథలూ, ప్రేయసులూ, హంసలూ, కోతులూ, కోయిలలూ,- ఏమీలేవు. అసలు మా పనేమిటో అది జాగ్రత్తపడేవాళ్ళం. కోయిలలూ మందమారుతాలూ వాటి జాగ్రత్త అవి పడేవి. వెతకడాలూ, చుంబనాలూ చాతకావు.

'ఎందుకురా వెధవ చదువులు ! పది గారెలు తినలేని, ఇద్దరు ఆడవాళ్ళకి జవాబు చెప్పలేని చదువులు ఎందుకురా అవి ? ఆ జాగ్రఫీల బదులు దేశమంతా తిప్పకూడదా ? ఆ హిస్టరీ బదులు పాత నాణాలకోసం గోతులు తవ్విస్తే, వృక్షశాస్త్రం బదులు దున్నిస్తే, జంతుశాస్త్రం బదులు గాడిద లెక్కిస్తే, గంటకి యెన్ని దండాలు తియ్యగలరో ఆ లెక్కలు చెపితే బాగుపడతారు మీరు. బైరన్ చదివి, ఎంకిపాటలు పాడి 'షా'ని కోట్ చేసి, కథలురాసి, ఆడపిల్లల్ని మరిగించి, తీరా భ్రమసి వొస్తే నువ్వు చేసే దేమిట్రా! ఒకటిన్నర తులం పొడు బిస్కటు ముక్కా, అరకప్పు టీ యిస్తావా వొయ్యారంగా ? తీరా సమయం వొచ్చేటప్పటికి మేమ్మేమ్మే అనడం-లేకపోతే ప్రేమమీద లెక్చరుకొట్టడం, తప్పించుకు పారిపోవడం. అయితే యింకొకటిలే ఈనాటి ఆడపిల్లలూ అట్లానే వున్నారు. చప్పిదవడలూ, కాలికీ కంటికీ జోడూ, వొగిన నడుములూ, పాచంటి చేతులూ- ఎందుకురా వాళ్ళూ....అన్నీ వున్న పిల్ల ఒక్కతె కనపడదే, వొద్దివాళ్ళల్లో తప్ప! సరిపోయినారులే ఒకరికొకరు!

'ఇదేనా షోలాపూరు.'

రైలు వేగం తగ్గించింది. ఆయనలేచి నలుగురిమీద నుంచి పెట్ట సర్దుతున్నాడు. మాటలు మాత్రం ఆగలేదు.

'అయినా బొంబాయి ఎందుకు నువ్వు ? ఆంధ్రదేశం చాలలేదూ? ఏ మైసూరుపాకు సంగతి-ఏం?'

'ఏమిటది'

'తెలీనట్టు చూడకు. చేసి పైగా దొంగచూపులు పెడతావా ? ఆ వెధవ మండుకొచ్చేది. మనలో మనకేం ? వొప్పుకో కూడదూ అంతమాత్రం? ఆ కాఫీ వాళ్లేమన్నారు ? చెప్పు హ, హ హ 'ఆంధ్రదేశం చాలదా, మైసూరుమీద ప అన్నారటగా!భలేవాడివి.

'అదేదో వెంకటచలంగారేమో నాకు తెలీదు.'

'ఒరే, అబద్ధం చెబితే, 'జోక్' కాసేపు. పొద్దస్తమానం అదే మాటా? అ మండుకొస్తుంది ఈ కుర్రాళ్ళతో మాట్లాడ్డం? పిరికి వెధవలు- నువ్వేదో నయమను కథల్లో నీ దాబులు చూసి, అందరికన్నా- అన్యాయం నువ్వు. సరేలే, బొంబాయిలో తన్నులు తినేవు? మొగాల్ళు కాదు ఆడవాళ్ళే తంతారు. ఆంధ్రులకు అపరిదిష్ట

రైలాగింది. సామాన్లు దించుకుంటున్నాడు. చప్పున ఏదో జ్ఞాపకం వొచ్చి దగ్గిర్నించే 'ఒరేయ్' అన్నాడు.

ఆ అరుపుకి ముగ్గురు పోర్టర్లూ, ఒక గుమాస్తా, రెండు కుంటి కుక్కలూ ఆ ఆ పెట్టె దగ్గిర.

'అయినా ఆ యూరేషియను పిల్లలతో నీకేం పనిరా? కంపుటగా వాళ్ళ

'నాకేం తెలుసు?'

'ఇంత పిరికి వెధవ్వి అనుకోలేదు. ఎంత మోసపోయినాను!'

'నే నా వెంకటచం కాదండీ.'

'కాదూ? ఎవరు నమ్ముతారు?'

మీరు నమ్ముతారా అన్నట్టు బండిలో వాళ్ళనీ, స్టేషన్‌లో వాళ్ళవంకా చూ

బండి సాగింది.

నేను నిట్టూర్పు విడిచి, ఆలోచిస్తున్నాను.

★ ★ ★

# కళారాధన

" ఈ సమయంలో కోసలరావు ఉంటే ఎంత బావుండేది!"

చలిగాలికి కిటికీలూ, తలుపులూ వేసుకుని కూచున్న మధ్యాన్నం అది. బయట తలుపుల్ని తట్టే గాలివాన. కాని గాలివానకోసం కాదు కోసల రావు. అతని అవస్త చెప్పుకుంటున్న జానకిరామయ్య కోసం.

"చేసుకున్న పిల్లల్ని వొల్లకపోవడం ఇప్పుడెంత ఎక్కువయిందంటావు! ఎక్కడ చూసినా రెండో పెళ్ళి, లేకపోతే ఎవత్తెనో తెచ్చుకోడం పరిపాటి అయింది. పూర్వం సిగ్గుపడేవాళ్ళు, నలుగురూ ఏమంటారోనని. ఇప్పుడు అదీ పోయింది."

"పూర్వం భార్యనిగాక ఇంకో స్త్రీని ఉంచుకోడం చాలా పరిపాటిగా మర్యాదైన పనిగా ఉండేది. ఈ క్రిష్టియన్లు వొచ్చి ఏకపత్నీత్వం నాగరికతా లక్షణమని బోధించడం వల్ల ఆ అలవాటు పోయింది. అందుకని ఈ విపరీతాలన్నీ."

"మొగవాళ్ళే నేమిటి? ఆడవాళ్ళే చేసుకున్న మొగుళ్ళు పనికి రాడంటో ఉంటే! అదెందు కంటావు?"

"అది స్త్రీ స్వాతంత్ర్య మోయ్!"

"మరి ఇంక ఇంతేనంటావా?"

"కలియుగం మరి! అదంతా ఇదివరకే రాసేశారుగా ఇలా జరుగుతుందని!"

"సరేలే. నా పిల్లలకే జరగడ మెందుకు?" అని విలపించాడు జానకిరామయ్య.

"ఏమంటాడు నీ అల్లుడు?" అన్నాడు ముసుకులోంచి చప్పున బైటికి వొచ్చి అచ్యుతం.

"ఏమీ అనడు. అఖ్కర్లేదు తీసుకుపొమ్మన్నాడు."

'ఏదో కారణం ఉంటుంది; కోసలరావే ఉంటేనా ఈ సమయంలో!"

"ఏమైనాడు వాడు. ఆ కోసలరావు?"

"ఎప్పుడు ఎక్క డుంటాడో ఎవరు చెబుతారు?" ఆ గాలినడుగు."

"ఏమిట్రా కోసలరావు విశేసం? వలపు మందులున్నాయా అతని దగ్గిర?"

"కోసలరావు సంగతి నీకు తెలీనే తెలీదా ఏమిటి? ఒక్క వలపు మందులేమిటి?

తలుచుకుంటే, నీకు తెలీకుండానే నీ తలతీసి గాడిద తలని తగిలిస్తాడు."

"పోనిద్దూ పాపం, వీడితల గాడిదకి తగిలిస్తే అది ఏడ్చిపోతుంది. ఎందుక

"ఆ కోసలరావు సంగతి చెపుదురూ?"

"మరి కాఫీ తెప్పించు, చెపుతాను."

కాఫీకి, ఫలహారానికి వంటింటోకి ఆర్డరు వెళ్ళిన తరువాత రాఘ చెప్పడం ప్రారంభించాడు.

"నాలుగేళ్ళయింది. నీ మాదిరి అవస్తే నాకు పట్టింది. చాలా మురిసి మ చేశాననుకో ఆ పెళ్ళి. మా అల్లుణ్ణెరుగుదురుగా, గోవర్ధన్. ఎంత అందం, నాజూకో. మనసూ హృదయం కూడ అలాంటివి. అప్పటికే గొప్ప చిత్రకారుడని ప్రఖ్యాతి వొచ్చింది. ఆస్థి, విద్య, ఏం లోపం లేదు.

ఇంకా ఏదో నేర్చుకుంటున్నానని కలకత్తాలో వున్నాడు. వొచ్చి మద్రా స్థిరపడతానని, అప్పటికింకా అమ్మాయిని మా ఇంటి దగ్గరే వుంచమన్నా. రేండేళ్ళయింది; నాలుగేళ్ళయింది ఆ కలకత్తా నించి రాడు. ఉత్తరాలు ఏదోరాస్తాడు. అదీ ఇదీ. ఆర్నెల్లు, ఏడాది ఆగమంటో, మనకో గొడవ వుం అత్తవారింటికి పంపకుండా ఆడపిల్లని అట్టిపెట్టుకుంటే, ఓ భూకంపాన్ని ఇం దాచుకున్నట్టు గోల చేస్తారు మనుషులు. అందుకని మనుషుల మాటలూ, ప్రశ్న పడలేక అమ్మాయిని తీసుకుని కలకత్తాలో సరాసరి అతని ఇంటికి వెళ్ళాను. ఇం తాళం వేసి వుంది. రాత్రి పడకొండు దాటితేగాని రాడన్నారు. నానా తిప్పలుపడి మా పిల్లా, ఏదో హోటల్లో భోజనం చేసి, ఆ గుమ్మంలో పడి వున్నాం. పన్నెండయింది అతను వొచ్చేప్పటికి. రెండు రోజులు ఉన్నాను కలకత్తాలో. అ పొద్దస్తమానం తన స్టూడియోకి వెళ్ళిపోయేవాడు, మేము వొచ్చాము అని అయి ఇంటి దగ్గర ఉండవచ్చే అనుకున్నాను. కాని వాళ్ల మన మోస్తరు మనుషులు కా ఆర్టిస్టు కదా. వాళ్ళ పద్ధతులే వేరు అని సరిపుచ్చుకున్నాను. అతను మాత్రం "త నేనే మద్రాసు వద్దా మనుకున్నానే! తొందరపడి వచ్చారేం? ఈ గదులు నా వొక్క తీసికొన్నాను ఇక్కడ వంటకీ దానికీ ఇబ్బంది" అన్నాడు. అంతే. అతను రోజల్లా వెళ్ళి ఒక్కత్తే అమ్మాయి యెట్లావుంటుందా అనిపించింది. కాని అది ఫరవాలేదండి. వొచ్చేశాను. తరవాత ఇరవై రోజుల్లో ఆదికూడా కలకత్తానించి యింటికి వచ్చేసిం మాట్లాడకుండా. తాను యింటికి వెడతానంటే, అతను రైలు యెక్కించేశాట్ట. నేనూ ఉండేటప్పుడే అనిపించింది. కొత్తగా భార్యకాపరానికివొస్తే అతనిమొహాన సంతోషమూ కనిపించలేదే అని. కాని ఆర్టిస్టులు అంతే గావును. మనకేం తెలుసు మనం మామూలు రకం మనుషుల మైతిమి అని వూరుకున్నాను. ఎందుకు వొచ్చా అంటే తన కక్కడ ఏం తోచలేదం టుంది. మొగుడితో తోచలేదని అంటే ఎ సాగుతుంది? పోనీ రాత్రులు పన్నెండింటికి వొస్తాడా, అప్పుడైనా వొచ్చి పడుక్కో



పక్క దగ్గిర టెలిఫోను లోంచి ఎవరితోనో మాట్లాడుతో వుంటాట్ట. నిద్ర లేవగానే మళ్ళీ టెలిఫోనులో మాట్లాడతాట్ట. ఇట్లా టెలిఫోనులో మాట్లాడుతోనే వెళ్ళిపోతాట్ట. మా అమ్మాయి అక్కడ తనకోసం ఉందని గుర్తే లేదుట. అంతేకాదు. అసలు ఏమీ లేదుట. కన్యగా వెళ్ళిన మా అమ్మాయి కన్యగానే తిరిగి వొచ్చింది ఇంటికి. ఏం చెయ్యం? అతనికి ఏమని రాయం? పోనీ మాట్లాడదామంటే, అతని తరపున పెద్దవాళ్ళెవరూ లేరు. ఇంకేం చేస్తాం? మనకో తృప్తి ఉందిగా ఈ దేశంలో. దాని ఖర్మం, అది ఇచేసుకున్న సుకృతం అని సమాధానం చెప్పుకున్నాను. కాని నా భార్య ఊరుకోలేదు. ఊరుకునే రకం మనిషికాదు. చాకలి జీతం ఎక్కువ కావాలంటాడా, నేను అవును. అన్నీ ప్రియమైనాయి. ఎక్కు వియ్యకపోతే బతుకుతారా?' అంటాను. కాని ఆమె వేసుకుంటుంది తగాదా. 'ఊరుకో అసలు పోతా' డంటాను. కాని వినదు. ఆ తగాదా ఆగి, చాకలి అడ్డమైన తిట్లూ తిని ఆ జీతానికే ఉతుకుతాడు. 'ఇంకేం లాభంలేదు. గేదె వొట్టిపోయింది. పాలు కొనుక్కుందాం' అంటాను. 'ఎందు కియ్యదు రోజుకి రూపాయి మేతమేస్తో?' అంటుంది. ఆ గేదె ఇంకో నెల పాలిస్తుంది. ఆమె గట్టిగా తలుచుకుని తగాదా పెట్టిందంటే, ఆకాశం బెదిరి వాన కురుస్తుం దనుకుంటాను. అమ్మాయి తిరిగి వొచ్చిందంటే ఆమె ఊరుకోలేదు. 'ఏమిటో ఈ సంగతి కనుక్కుందాం' అని నన్నూ అమ్మాయినీ తీసుకుని కలకత్తా బైలు దేరింది.

ఎవరో ఎప్పుడూ విని ఎరగని బంధువుల్ని కలకత్తాలో కనిపెట్టి, వాళ్ళ ఇంటో మమ్మల్ని దింపింది. వీళ్ళెవరా, ఏ బంధువులా అని చూశారు మొదట్లో వాళ్ళు. కాని ఆమె మాటలవల్ల చాలా ఆప్తులైనారు సాయింత్రం లోపల. వాళ్ళ చేతే ఆరాలు తీయించింది. మా అల్లుడుగారి సంగతి. చివరికి తేలిన విషయం ఇది ;

ఆ వూళ్ళో ఒక ఆంధ్ర వనిత వుంది. ఆమె పేరు సవితాదేవి. ఆమె ఒక నాట్యకళాశాల స్థాపించింది బెంగాలీ విద్యార్థినులకి. తెలుగు పిల్లలు కూడా వున్నారు. వాళ్ళు ఆమె ఇంటోనే వుంటారు. చాలా ప్రసిద్ధిలో వుంది ఆ కళాశాల. ఆమె అందమైనది. గుణవతి. పెద్ద చదువులు చదివింది. ఆమెకి ఓ భర్తా వున్నాట్ట. ఆ ఇంటో ఆమెతోనే ఉంటాట్ట. కాని అతని సంగతి యెవరికీ తెలీదు. అతనెవరో గుర్తించను కూడా లేదు. ఆమె యిల్లు నాట్యకళాశాలే కాదు. కళారాధకుల కందరికీ అది ఒక ఆలయం. ఆమె దేవి. మా అల్లుడు ఆ దేవాలయంలో ప్రధాన పూజారి. ఇతని స్టూడియో కూడా ఆమె మందిరంలోనే. అక్కడ కొందరు విద్యార్థినులకి పెయింటింగు నేర్పుతున్నాడట. ఆ సవితాదేవి అంటే మా అల్లుడికి, స్త్రీలలో అత్యున్నతమైన స్త్రీ. కళా స్వరూపిణి, ఆరాధ్య దేవత. ఆమె తప్ప ఇంక ప్రపంచం ఆతనికి లేదు. ఆమెనే అనేక చిత్రాలలో ఆదర్శం చేసుకుని, చిత్రించి అమితమైన ఖ్యాతి గడించాడు.

కాని ఇంతకీ ఆమె నిష్కలంక చరిత్ర. ఆ భర్త హస్తాలైనా ఆమెను కామంతో స్పృశించాయో లేదో నని అనుమానమే. అశీలం, కామం, పురుషవాంఛ-ఇట్లాంటివి ఆమె ఆలయానికి రెండు మైళ్ళ దూరంలో తాత్కాలికంగానైనా తొంగి చూడటానికి

వీల్లేదు. ఎంతో మంచి మహనీయులైన పురుషులంతా దిన దినమూ ఆ ఆలయ
హారతులర్పిస్తున్నా, ఆమె వీటన్నింటికీ అతీతురాలు-ఆమె ప్రజల విరోధులైనా, ఆ
గురించి రహస్యంగానైనా అపోహ పడడానికి వీలులేదు. తెల్లారింది మొదలు
సమయం వరకు ఆమె చుట్టూ వంద జనం వుంటారు. విద్యార్థినులు, పరిచా
మిత్రులు, ఆమెకు ఏకాంతమనేదే లేదు! రాత్రి పదకొండు కొట్టిందా, భర్తో
మా అల్లుడితో సహా అందరూ వెళ్ళిపోవలసిందే. ఆ కళానిలయాధిష్ఠా దేవత
అల్లుణ్ణి చూస్తే అమితమైన స్నేహం వాత్సల్యం, ఇష్టం అనురాగం. అతని కా
సోదరి. తల్లి. దేవత. అంతేకాని ఆమెకి ముందు ఎవరూ 'ప్రేమ' అని ఏ విషయ
కూడా ఉచ్చరించడానికి వీల్లేదు."

అదీ చరిత్ర. బాగానే వుంది. కాని ఈ ప్రోగ్రాంలో మా అమ్మాయికి
లేదన్న సంగతి చాలా విదితమయింది. పోనీ రాత్రి పదకొండు తరవాత, తన
ఆదరించ కూడదా అంటే, సంగతుల్ని బట్టి అతను నిద్రావస్థలో కూడా
సహస్రనామార్చలోనే తత్పరుడైనట్లు కనబడుతుంది.

అతన్ని కలుసుకున్నాం. అతనిముందు నా భార్య తన జీవితంలో ప్ర
అపజయాన్ని అంగీకరించింది. 'తన కళ, తన పని' అంటాడు యెంతసేపూ.

సవితాదేవి వూసెత్తలేదు.

మరి 'యెందుకు పెళ్ళి చేసుకున్నా'వని అదమాయించింది నా భార్య

'తప్పే' నన్నాడు.

'ఇంతేనా' అంటే మాట్లాడడు.

'ఈ అమ్మాయినేం చేసుకోము?' అంటే-

'మీ యిష్టం. ఇక్కడ వుంటే నా కభ్యంతరం లేదు. ఎందరు
పొద్దస్తమానం తమ ఉద్యోగాలలో అర్థ రాత్రుల వరకూ ఉండి పోవడం
క్లబ్బులనించి అర్థరాత్రికేగదా ఇళ్ళు చేరుకునేది?' అన్నాడు.

చివరికి తెగించి నా భార్య "మరి అప్పుడైనా అర్థరాత్రికైనా ఇది నీకు కన
కద!" అంది.

"కనపడకేం?"

"లాభమేముంది?"

"కాని ఏం లాభం?"

"ఏం మాట్లాడవుట!"

"ఇంకా కొత్త కద?"

కాని అతని అయిష్టం కనపడుతోనే వుంది. ఇంక రెండే విధాలు.



మా అమ్మాయిని కూడా ఆ ఆలయంలో నన్నా చేర్చాలి. లేక అతని ఇంటిదగ్గిర దాని గతికి దాన్ని వొదలనన్నా వొదలాలి. కాని దేనికీ సమ్మతించ లేదు మా అమ్మాయి. అది మితభాషిణి. కాని చాలా తెలివిగలది.

"ఏం తోచకుండా ఈ ఇంటో పడివుండే కంటే, హాయిగా ఇంటి దగ్గరే ఉంటేనేం?" అని అడిగింది.

"కాని-లోకులమ్మా!" అని ఏడ్చాను.

"లోకులకు నన్ను బలిస్తారా? సరేలే. వెళ్ళండి. మీకు అపరిదిష్ట లేదు లెండి. కాని మళ్ళీ నన్ను చూస్తామని ఆశ పెట్టుకోకండి" అంది.

ఈ పెళ్ళి అనేది క్రమంగా ఎంత రోత అయిన వ్యవహారమై పోతోందంటారు? వాళ్ళకి వాళ్ళు పెళ్ళిళ్ళు చేసుకుంటే, ఏదో దాని ఫలితాలు వాళ్ళు అనుభవిస్తారు. మహా ఏదో అంతా తెలిసినవాళ్ళ మల్లే, తల్లి దండ్రులం, వాళ్ళకి ఓ మొగుణ్ని వెతికి తెచ్చి, కట్నాలిచ్చి కట్ట పెట్టిం తరవాత, వాడు చచ్చినా, పిల్లని వొదిలినా, "ఏం చేశావు నా బ్రతుకు?" అన్నట్టు వాళ్ళ కళ్ళు మన వంక చూస్తున్నట్టే వుంటాయి.

గతిలేక, ఆడపిల్ల తలిదండ్రుల మైనందుకు విధిని హిందూదేశాన్నీ, ఋషుల్నీ ఆచారాల్నీ తిట్టుకుంటో సవితాదేవిగారినే ఆశ్రయించబోయినాము. ఆమె మందిరం సాక్షాత్తు సరస్వతీ నిలయమనుకో. ముందు మా కసలు ప్రవేశం ఎంత కష్టమయిందంటావు ! సంగీతాలు, నాట్యాలు, చర్చలు, రంగు రంగు చీరెలు, సుగంధాలు....మా అల్లుడేమిటి, వీలైతే నేనూ ఓ పూజారినై ఉండిపోనా అక్కడ అనిపించింది.కాని ఓ పట్టాన ఆమె దర్శనం అయితేనా? అయిం తరవాత కూడా ఏకాంతంగా అమలు పడితేనా ? చివరికెట్లాగైతేనేం సాయంత్రానికి సాధించాం మా అల్లుడు ఏదో పటం గీస్తున్నాట్ట తన స్టూడియోలో, కొంతమంది విద్యార్థినుల సహాయంతో.

కనపడ్డ తర్వాత మమ్మల్ని చాలా మర్యాద చేసింది. మమ్మల్నేమిటి, ఎవరినన్నా చేస్తుంది. కుశలు ప్రశ్నలు వేసి అన్నీ కనుక్కుంది. ఒక గంటని గావును నొక్కింది. దాంలోంచి ఒక సంగీత స్వరం దూరంగా వినపడ్డది.

త్వరలో ఇద్దరు సేవకులో, విద్యార్థినులో - అమ్మాయిలు, చాలా అలంకారమైన పళ్ళాలలో ఫలహారాలూ, టీ తీసుకుని వొస్తున్నారు. వినపడే ఒక పాటకి పళ్ళాలతో సహా నాట్యం చేస్తో. అక్కడ పాటలు తప్ప మాటలు వుండవు. నాట్యం తప్ప నడక వుండదన్నమాట. చాలా చుట్టు తిరిగి, చివరికి బల్లదగ్గిర కొన్ని వొంకర్లు తిరిగి పళ్ళాల్ని బల్లమీద పెట్టి వెనక్కి నాట్యం చేస్తో కళ్ళు తిప్పుతో నిష్క్రమించారు. ఆ ఫలహారాలన్నీ చాలా రంగురంగులుగా అనేక సుందరాకారాలలో చేశారు. కాని ఎన్ని తిన్నా బుగ్గలనిండా రావు. ఉత్తగాలి. టీ చాలా అందమైన కప్పుల్లో వుంది. కాని ఉగ్గుగిన్నెలంత వున్నాయి, ఆ కప్పులు. టీని ఒక్కొక్క చుక్కే నాలిక మీదికి అందంగా పోనిస్తో ఆమె-

"మీరు ధనవంతులే ననుకుంటాను?" అంది.

"ఏం ధనంలెండి........"

"నెలకు ఐదువందలు తీసుకుంటాను"

"ఈయన అట్లాంటివారు కారండి" అంది నా భార్య.,

బల్లకింద దాని కాలు నొక్కాను.

"చేర్చుకునేముందు మీ అమ్మాయికి కొన్ని టెస్టులు పెట్టాలి."

"అదీ ఆ టెస్టులు తినదు. నేను తిననీను" అంది నా భార్య ఖచ్చితం

మళ్ళీ కాలు ద్వారా దాని నోరు నొక్కాను.

"అది కాదు. మే మో........"

"ఏది కాదు? మీ అమ్మాయిని ఇక్కడ చేర్చాలని కాదా మీరు వచ్చి ఐతే ఎందుకొచ్చారు? టైమ్ వేస్ట్" అని లేచింది ఆమె.

"మే మో విషయమై........"

"విషయాలు ప్రస్తావించడానికి నాకు వ్యవధి లేదు" అని ఆమె మళ్ళీ నొక్కు నొక్కింది గంటని. ఇంకో విధంగా శబ్దమయ్యేట్లు.

నృత్యం చేసుకుంటో పువ్వులుచల్లుకుంటో వొస్తున్నారు ఇద్దరు యువతు మమ్మల్ని బైటికి పంపించడానికి. నేను లేచాను, మర్యాదగా వెడితే మంచిదని. నా భార్య లేచి తలుపుకి అడ్డంగా వాళ్ళని రానీకుండా చేతులు జాచి నిల ప్రారంభించింది. "ఏమిటనుకుంటున్నావు ? ఈ కోతి వేషాల్ని చూసి మోసపోతాననుకున్నావా, దడుసుకుంటా ననుకున్నావా? నువ్వేం ఆడదానివి కా వీళ్ళందరూ ఆడవాళ్ళేనా ? ఇట్లా వంకర తిరుగుతో వీళ్ళ మొగుళ్ళతో ఏం కాపు చేస్తారు ? ఇదిగో విను. అదంతా నాకెందుకుగాని, నా అల్లుడి జోక్యం నీ కెందుకు పొద్దస్తమానం నీ సేవ చెయ్యడమేనా అతని పని? ఎటువంటి శుభ్రమైన మని యే స్థితికి తీసుకొచ్చావు. అయిందేదో అయింది. ఇకనన్నా వొదులుతావా లేదా"

ఆ సవితాదేవి తెల్లబోయి చూస్తోంది. ఆ మాటలు ఆమెకి అర్థం అయిన లేదు.

"మీ అల్లుడేమిటి? ఎవరు?" అంది.

"గోవర్ధన్. నీకు అతనెందుకు? పెళ్ళి చేసుకున్న పెళ్ళాన్ని వొదిలించి, నీ వెం తిప్పుకుంటున్నావా ? ఇదీ పరాయి దేశమై పోయింది. కాని తెలుగు దేశమే ఐతే నలుగురిలో నీ మొహం ఈడిపిద్దును."

"మీరేదో చాలా అసందర్భంలో వున్నారు. ఆయన్ని ఎవరు వుంచా రిక్కడ" అంది ఆమె శాంతంగా.



"ఉంచకపోతే యెందుకు వుంటాడు ! నువ్వెవత్తవని భార్యవా అక్కవా, నీ దగ్గిర ఎందుకు వుంటాడు...........?"

చాలా శ్రుతిమించుతోంది. కార్యం చెడిపోతుంది సరికదా, అసలు ఆ మాటలు చాలా అన్యాయ మనిపించాయి నాకు. చప్పున భర్త వీటోని వుపయోగించి నా భార్యని శాంతింపచేశాను.

"గోవర్ధన్ని పిలు" అంది సవితాదేవి. నోళ్ళు వేళ్ళాడేసి, నర్తన మరిచి, మా ఆవిడ దాన్ని చూస్తో నిలబడ్డ పిల్లల్ని. నృత్యం చేసుకుంటో, పాడుకుంటో వెళ్ళిపోయినారు వాళ్ళు.

"ఇదేమిటండీ, ఆయన ఇక్కడ ఓ ఉద్యోగి" అంది మళ్ళీ సవితాదేవి.

"ఏం జీత మిస్తున్నావు?"

"జీతం లేదు. గౌరవోద్యోగి."

"ఏమిటా ఉద్యోగం, నీ వెంట తిరిగే వుద్యోగం. ఈ ఉద్యోగాలలో ఏ జీతం ముడుతో వుంటుందో నాకు తెలీకపోలేదు. నీ మొగుడితో నువ్వు సరిగా కాపరం చెయ్యి, లేకపోతే, ఇంకోడితో చెయ్యి నా అల్లుణ్ని వొదిలెయ్యి."

"ఇంక నేను సహించను, సరిగా బయటికి నడుస్తారా, లేకపోతే దర్వానుచేత గెంటించనా ?"

"గెంటిస్తావా ? నన్ను గెంటిస్తావా ? నిన్ను ఈ దేశంలోంచి గెంటిస్తాను. పద- గెంటించు. ఏ మాత్రం...."

ఇంతలో గోవర్ధన్ వొస్తున్నాడు. అతని రెండు వేపులా ఇద్దరు కన్యలు ఆహ్వాన నృత్యం చూపుతో తీసుకొస్తున్నారు. చాలా చాలా తీరుబడిగా మహారాజులాగు వొస్తున్న వాడల్లా అత్త కంఠం విని చప్పున పరిగెత్తుకొచ్చాడు మా వేపు. నృత్యానికి మధ్యనున్న ఆధారం పోయేప్పటికి, గాలిలో కాసేపు చేతులాడించి నుంచుని పోయినారు ఆ కన్యలు.

లోపలికి వొచ్చి, "ఏమిటి ? ఇదేమిటి ?" అంటున్నాడు గోవర్ధన్.

"వీళ్ళు........" అని పాపం మాట తెమల్చుకోలేక పోయింది. సవితాదేవి.

"ఎందుకు ఇక్కడికి వొచ్చారు? ఇంటికి రండి మాట్లాడదాము."

"ఆ మాటలై నాయిగా, నా మొహం, మాట్లాడేదేమిటి ? ఇదిగో చూడవోయ్. కళ అని, బొళ అని, పెళ్ళాన్ని వొదిలేసి, వీళ్ళ కొంగుల్లో ఆడుకుందామనుకున్నావు గావును. ఏదో చాలా పనిమీద ఉన్నావని, పిల్లని ఇంటిదగ్గిర పెట్టుకు కూచున్నాను, ఇన్నాళ్ళు, ఇదా నీ పని, దీని పనీ పట్టిస్తాను" అని లేచింది మా ఆవిడ ఉగ్రురాలై పోయి. ఆమెని చూడ్డానికి నాకే భయమేసింది. ఈ ఆర్టిస్టులందరూ సాత్వికులు,

అట్లానే మా అల్లుడునూ. అత్త రౌద్రాన్ని పటంకింద గియ్యగలడుగాని, ఆ
ఎదురు నిలవలేనంత సుకుమారి. ఎక్కడో తప్ప, సాధారణంగా యీ
వ్యవహారమంతా పువ్వులతోనూ, దూదిమబ్బులతోనూ, తేట నీటితోనూ,
పిట్టలతోనూ, మందహాసాలతోటే గాని, నిజమైన జీవితంలో ఓ చీపురు కట్ట
జవాబు చెప్పలేరు. కోడిపిల్ల వాళ్ళని అరమైలు దూరం తరుముతుంది.

పాపం, నా భార్య ధాటికి సవితాదేవి మూర్ఛ పోయింది. మా అల్లుడు
తెమ్మన్నాడు ఆ పిల్లల్ని. వాళ్ళు చప్పున తెలివి తెచ్చుకుని, పన్నీరు
వెనక్కి నృత్యం చేస్తో కదులుతున్నారు. విధిలేక మా అల్లుడే పరుగున వెళ్ళి
తెచ్చి చల్లి ఆమెని కూచోబెట్టాడు.

"సవితా, నువ్వు వెళ్ళి పడుకో. నేను...."

"నీ వెనకనే నేనూ వొస్తా...." అని వెక్కిరింపుగా పూర్తిచేసింది
భార్య.

అతను నా వంక తిరిగి "ఏమిటీ మాటలు? కొంచెం పూరుకోబెట్ట
అన్నాడు.

"నువ్వు కొంచెం పూరుకో. అతన్ని మాటాడనీ" అన్నాను నా భార్యతో

"మీరు నమ్మాలి నా మాట. ఆ విధమైన ఆరోపణ వల్ల నాకు కాదు,
ఆమెకి చాలా అన్యాయం చేస్తున్నారు. నమ్మండి నా మాట" అన్నాడు.

అతని మాటల్లో నిజం వుందనే అనిపించింది నాకు మాత్రం.

"అది సరే. మా అమ్మాయి సంగతి ఏమిటని? అదీ మాకు పట్టిన

"గోవర్ధన్ గొప్ప ఆర్టిష్టు. మీరు అతన్ని ఆ విధంగా చూడాలి గాని, మామ
అల్లుడిలాగు మాట్లాడితే ఎక్కడామన మాటలకి పొందిక కుదరదు" అన్నది
సవితాదేవి.

నా భార్య జవాబుని ఆపి నేను, "ఆర్టిష్టులకి ఇల్లూ వాకిలీ, పిల్లా
ఉండడానికి వీల్లేదా?" అన్నాను.

"కాని అతను సామాన్యమైన ఆర్టిష్టు కాదు. అతని జీవితం
అంకితమైపోయింది.

"కళం అంటే మీరేనా?" అంది చటుక్కున నా భార్య.

"ఏమిటి? తన వూళ్ళో, మా వూళ్ళో ఎక్కడైనా చిత్రాలు రాయవచ్చు
' అన్నాను.

"ఇక్కడి వాతావరణం అతనికి చాలా అనుకూలం."

"సరేలెండి. రాత్రిం బగళ్లు కళే! చిత్రాలు రాసే వాళ్ళందరూ
వాతావరణాల్నే పట్టుకుంటారా." అన్నాను.





చిక్కంనించి తప్పించుకుని మా ఆవిడ "నీ వాతావరణవేంనా?
ఏవ్వంటేగాని,నీతో...." అంటోంది.

"ఆగండి మాటాడకండి" అన్నాడు గోవర్ధన్.

"పోనీ ఆర్టిష్టులు భోజనం చేస్తారా, అందరిమల్లే?"

"అదీ ముఖ్యంకాదు, ఏదో ఏ వేళకో...."

"అలా ఏదో ఎప్పుడో తినే తయారవుతున్నారు. ఎండు నక్కల్లాగు. సరిగా
తే ఎందుకు తింటే కళ రాదా? భోజనం చేస్తారుకదా! ఇంక ఎటువొచ్చి పడకలేనా?
భార్య కాకుండా వుంటేసరి కళేనన్నమాట!" అంది నా భార్య.

"నా మాట నమ్మండి. అతను నా తమ్ముడు. నన్ను అక్కా అని పిలుస్తాడు,
మీ మలినమైన...."

నా భార్య విరగబడినవ్వి "అది కూడానా?" అంది.

"భార్య కళకి ఆటంక మంటా...?" అన్నాను, నా భార్య నవ్వును ఆపడానికి.

"కళకి ఓ అక్క ఉండాలా?...."

"అవును. భార్య ఆటంకమే. ఇట్లా, సంసారమూ, పిల్లలూ, జబ్బులూ, చీదరా-
అన్నీ కళని చంపేస్తాయి" అంది సవితాదేవి.

"భార్యతో కాపరంచేస్తే ఆటంకమూనూ, అక్కతో చేస్తే...."

గోవర్ధన్ లేచాడు, "ఇంక మీరు వెళ్ళడం మంచిది" అన్నాడు కఠినంగా.

"ఇంతకీ ఏమంటారు ?"

"ఏమీ అనను. మీ అమ్మాయిని ఎవరూ నిరాకరించటంలేదు.
ఉండనియ్యండి. కాని ఆమె అతనికి భారం కాకూడదు. ఇట్లాంటి గొప్ప ఆర్టిష్టు
మామూలు సంసారి ఐపోతే లోకానికే గొప్ప నష్టం" అంది సవితాదేవి.

"రాత్రులు పెళ్ళాం పక్కన పడుకుని కూడా టెలిఫోనులోంచి అక్కతో
సరసాలాడుతోవుంటే ఇంక ఆ భార్య ఎందుకు ?"

"అతని జీవితం కళకి అంకితమై పోయింది. అటువంటి బోరన్ ఆర్టిస్టుకి
మీరు మీ పిల్లని పెళ్ళి చెయ్యడం చాలా తప్పు చేశారు."

"అల్లాంటి బోరన్ ఆర్టిస్టు మా అమ్మాయిని పెళ్ళి చేసుకోవడంలో ఏమీ
తప్పులేదా ? పైగా పెళ్ళిచేసుకున్నందుకు పదివేలు ఖర్చుచేసి ఏదో కళాక్షేత్రమట -
దాంటో నాలుగేళ్ళు చదివించాం" అన్నాను.

"అవును. అల్లాంటి ఆర్టిస్టుకి సహాయం చేసే అదృష్టం కలిగినందుకు మీరు
గర్వపడాలి."

"ఇంటికి వెళ్ళి తీరకగా గర్వపడతాం లెండి, ఇప్పుడు మా పిల్లగతి ఏమిటి.'

"ఏముంది? తన జీవితాన్ని గోవర్ధన్‌కి అంకితం చేసెయ్యమనం పతివ్రతలు అంతే కద;"

"మా అమ్మాయి జీవితం అతనికి అంకితమా ? అతని జీవిత అంకితమా? మా పూరైపోతేనా, నీ జీవితాన్ని పెంటకుప్పకి అంకితం చేద్దును నువ్వనేది?" అంది నా భార్య.

"ఎందుకు ఊరికే ఘర్షణ పెంచుకుంటారు? నా అభిప్రాయం చెప్పాను. రా, సవితా ?" అని ఆమెని బుజంమీద చెయ్యేసి తీసుకు వెళ్ళిపో మా అల్లుడు.

అదీ, నా భార్య పొందిన పరాజయం.

వొచ్చేశాం మా వూరు.

అటు తరువాత రెండేళ్ళకి గావును కోసలరావు వొచ్చాడు మా కోసలరావు ఇంటికి వొచ్చాడంటే-ఆ ఇంటి యజమానితోనే కాదు, ఇంటి పిల్లి పరిచయం చేసుకుంటాడు, వాడు ఉన్న మూడు గంటల్లో. అతను వెళ్ళినే నెలలదాకా వెతుక్కుంటోనే వుంటాం అతను వెళ్ళిపోయినాడని. అదొక అపూ అసాధారణ జాతకమో మరి! వొచ్చిన అయిదు నిమిషాలకే మా అమ్మాయితో బా వేశాడు. అది అల్లిన కుట్లు చూశాడు. రెండు పాటలు పాడించాడు. తనకంటె గొ అని ఎవరినన్నా నా భార్య అంగీకరించిందంటే అతనే కోసలరావు! ప్రారంభించింది. అతని దగ్గిర తన హృదయ బాధ. ఆమె వాక్ప్ర ఆరికట్టగలవాడు కూడా అతనొక్కడే. అప్పటికా ప్రశంస అపి, భోజన తాంబూలం వేసుకునేప్పటికి వాయిదా వేయించాను కష్టంమీద. మ యీజీఛైర్లో పడుకుని, నా భార్య వాగ్భగీ రథికి ఆనకట్ట తలుపులు ఎత్తించే కోసలరావు మా అమ్మాయి సంగతి, అత్తవారింటి సంగతి అడుగుతున్నారో ఇంతలో లోపల్నుంచి వొచ్చింది నా భార్య.

"అల్లుడు! ఇంకేం అల్లుడు నాయనా!" అంది.

"ఏమిటి ? ఏమైనా డేమిటి ?" అన్నాడు కోసలరావు కుర్చీలో దిగ్గున కూచుని.

"కళకి అంకితమైపోయినాడు."

"అదేమిటి?"

"కళకో కళావతికో అంకితమై పోయినాడు. అట్లాంటి వాళ్ళకి భా అనవసరమట ;'

"ఏ వూళ్ళో ?"

కలకత్తాలో.



"కలకత్తాలోనా? కళకా?....కొంపతీసి ఆ సవితకి కాదు కదా?"

"సరిగా కనుక్కున్నారు."

"అట్లాగా. సవితకి అంకితమైతే ఊడతియ్యడం కష్టమే."

"మీకు తెలుసునా ఆమె ?"

"తెలీకేం ? వాళ్ళది రాజోలే. పెళ్ళి కూడా మామూలుగానే అయింది. పెళ్ళికి వెళ్ళాను కూడా నేను........కాని, ఇప్పుడు తెలుగు మాట్లాడదు ఆ అమ్మాయి. తెలుగుదేశం వొదిలి, చాలా ఉన్నత దశకి వొచ్చింది. మీ అల్లుడూ ఆమా కాపరం పెట్టారా ?"

"ఏబ్బే - లేదు, అట్లాంటి మాట ఆ మందిరంలో ఉచ్చరించకూడదట."

"మీరేం ప్రయత్నాలు చేశారు?"

"ఏం చేశాం ? ఇది ఆవెను పట్టుకుని నానా మాటలు అంది, అనవలసినవన్నీ."

"అంతేనా? అదేం లాభంలేదు. పైగా ఆమెకు చాలా గొప్పవాళ్ళ మద్దత్తు వుంది. ఆమె భారతీయ కళని ఉద్ధరిస్తోందని గొప్ప పదవుల్లో ఉన్న చాలామంది గొప్పవారి నమ్మకం."

"ఇంక ఇంతేనంటారా మీరూ? మీ మీద గంపెడాస పెట్టుకున్నాం"

"ప్రయత్నం చేద్దాం. ఫలించినా, మీ అమ్మాయి అతనితో కాపరం చేసేందుకు ఓ రెండు మూడేళ్ళు పట్టవచ్చు."

"రెండు మూడేళ్ళే!"

"చెప్పలేను అప్పుడే. అసలు సంగతులు నాకు స్పష్టంగా తెలీవు. తెలిసే అవసరం పుట్టలేదు....పదవోయ్, బయలుదేరు."

"ఎక్కడికి?"

"కలకత్తాకి."

"ఏం లాభంలేదయ్యా. అన్నీ చూశాం."

కాని నా భార్య ఊరుకోలేదు. సామాను సర్ది నన్ను ఇంటోంచి బయటికి గెంటింది. బండి ఎక్కినప్పటినుంచి నా ఛార్జి కోసలరావే తీసుకున్నాడు. నా డబ్బూ అతనే తీసుకున్నాడు. ఏ టిక్కెట్లు కొన్నాడో ఎవరితోనో మాట్లాడి ఫస్టుకాల్లసులో ఎక్కి నిద్రపోయినాము. కలకత్తాలో ఓ కారెక్కించి ఎవరో బెంగాలీల ఇంటో దించాడు నన్ను. ఆ బెంగాలీల వంటింటో చేరి వాళ్ళచేత తెలుగు వంట చేయించాడు. బోజన మయిం తరవాత "మరి ఇప్పుడేం చేద్దాం?" అన్నాను.

"ఏం చెయ్యొద్దు. హాయిగా కూచో. తోచకపోతే గొప్ప మ్యూజియం వుంది- అది చూడు. సాయంత్రం పార్కులకు పో."

"నువ్వా?"

"నాకు బోలెడు పనులు. కనపడ్డప్పుడు కనపడతాను. నే నుంటే చారూ అవీ కాయిస్తాను. నేను లేక, ఇక్కడ తిండి సయించక పోతే, పక్క అరవ హోటలు వుంది. అక్కడ భోంచెయ్యి.

"అదంతా సరేలే. మనం వొచ్చిన పని...."

"నేను చూస్తాగా."

పదిరోజు లయింది. కోసలరావు కనపట్టం లేదు. నేను లే వెళ్ళిపోతాడు. కొన్ని రాత్రులు రానే రాడు. పది మందితో కలసి హడావిడిగా చూస్తుండగా ఏదో భాషలో మాట్లాడుకుంటూ వెళ్ళిపోతాడు. అప్పుడప్పుడు వుందా ? ఏమన్నా కావాలా?" అని కేకేసి పోతాడు, తన డబ్బు నా మొదలే చెప్పాడు-ఓ వెయ్యి రూపాయలు తీసుకురమ్మని.

ఓ రాత్రి ఒంటి గంటదాకా మేలుకుని కూచున్నాను అతని కోసం నన్ను చూసి, "ఇంకా మేలుకుని వున్నావేం?" అంటో తనగదిలోకి పోతు నేను అతన్ని ఆపి "ఇంకెన్నాళ్ళు?" అన్నాను.

కొంచెం ఆలోచించి. "అవును. నీదో వ్యవహారం వుందికదూ! కనుక్కు నాలుగైదు రోజుల్లో తీరిక దొరుకుతుంది. మాట్లాడతాను" అంటూనే వెళ్ళి కొడుతున్నాడు.

అతని హడావిడి చూస్తే, ఇన్నాళ్ళూ ఆ ప్రయత్నమంతా నా అనుకున్నాను. ఒకటే టెలిఫోన్లలో మాట్లాడడం, ఎవరినో కార్లలో తీసుకు అదీను. టెలిగ్రాం ఇచ్చి మా అమ్మాయిని రప్పించడమే తరువాయి అనుకుంటు నాలుగైదు రోజుల్లో ఇంకా ఏదో మాట్లాడతాట్ట!.

మూడో రోజు రాత్రే మంచి నిద్రలో ఉన్న నన్ను లేవకొట్టాడు.

"నేను అనుకున్నదంతా అయ్యింది" అన్నాడు నిరాశతో.

"ఏమిటి?"

"ఆ సవితకీ నీ అల్లుడికీ మధ్య ఏం లేదు" అన్నాడు దిగులుతో.

"ఇదా నువ్వు కనుక్కున్నది ఇంతదూరం వొచ్చి, పైగా నాడబ్బు ఖర్చుచేసి...." అనుకున్నాను మనసులో.

"డబ్బైపోయింది" అన్నాడు.

"ఏమిటి, వెయ్యిరూపాయిలూనా?"

"కాక? వైరియ్యి రేపు, ఇంకో వెయ్యి పంపమని. డబ్బు రాగానే రోజుల్లో వెళ్ళిపోదాం.! నేను వొచ్చిన బిజినెస్ అయిపోయింది."

"నువ్వు వొచ్చిన పనేమిటి? నాదేగా!"



"నీదా? నాకెన్ని పనులు! నీది చాలా చిన్న వ్యవహారం."

"సరే. ఇప్పుడేమిటి ఇంతకీ? వాళ్ళమధ్య ఏం లేకపోతే ఇంత గొడవెందుకు?"

"ఇది సాధారణ వ్యవహారం కాదోయ్. దీని పరిహారం సైకలాజి కల్గా జరగాలి. వాళ్ళిద్దర్నీ తందా మనుకున్నాను. లాభంలేదు. వాళ్ళిద్దరి మధ్యా ఏం లేదు."

"లేకపోవడ మేమిటి? నాన్‌సెన్సు."

"లేకపోవడమేం? బోలెడు వుంది!"

"మరి!"

"అంటే పడకలు లేవు. అదే వొచ్చిన ఖర్మం."

"ఏమిటో మాట్లాడు తున్నావు."

"విను. ఆడదానికీ, మొగవాడికీ వుత్త స్నేహముండి, అన్ని వీళ్ళూ వుండి, పడకలు లేకపోతే; అది చాలా అసహజం. అందువల్ల అపాయకరం. ఎందుకు పడుకోరు? అది చెప్పు."

"అవును. ఎందుకు పడుకోరు? పరువు నష్టమేమో!"

"అదికాదు ఇక్కడ. ఎవరికీ ఏమీ తెలీకుండా సాగించవొచ్చు. పైగా వాళ్ళిద్దరికీ సంబంధం లేదని ఎవరూ అనుకోడంలేదు. ఇంకేం?

"పిల్ల భయమూ లేదు...." అన్నా.

"అవును. ఆమెకి అన్నీ తెలుసు. అదీగాక ఆమెకు పిల్ల లేమిటి? ప్రజాపతికూడా, చివరికి-బాలనాగమ్మలో డాక్టర్ గోవిందరాజులు కూడా- ఆమెకు ఓ పిల్లనీ ఇవ్వలేదు. విను. ఇట్లా వాళ్ళు విడిగా వుండడం చాలా ఘోరం. కలుసుకుంటే కళకు అపరాధంట, ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి అపరిమితమైన కాంక్ష, కాని కళకోసం తీర్చుకోరు. ఆ మత్తులో పడ్డ వాళ్ళని బయటికి లాగడం ఎవరి తరమూ కాదు.

ఇంక రెండేళ్ళుపోతే అసలు ఏ భార్యా ఉపయోగం వుండదు. త్వరలోనే రక్షించాలి అతన్ని-నీ కోసం.... అంటే నీ కూతురికోసం. అని గుర్రు పెడుతున్నాడు ఓ నిమిషంలో.

మర్నాడు పగలంతా ఎక్కడెక్కడో తిరిగి, డబ్బుకోసం టెలిగ్రాం యిచ్చి, 'ఈ కబుర్లు చెప్పడానికా నన్నింత దూరం ఇతను తీసుకువచ్చి ఖర్చు చేయించాడు' అని కోసల రావుని తిట్టుకుంటో, టెలిగ్రాం రాగానే ఆ డబ్బు అతని చేతికివ్వకూడదని నిశ్చయించుకుని నిద్రపోబోతో వుండగా కోసలరావు వొచ్చాడు.

"అప్పుడే ఏం నిద్ర?" అని నన్ను తనతో ఓ పెద్ద హోటలుకి లాక్కెళ్ళాడు. దాని దర్జా చూస్తేనే చాలా డబ్బు ఖర్చయ్యేట్టుంది. ఆ రాత్రి.

"నా దగ్గిర డబ్బు లేదు, నీ దగ్గిర వుందా?" అన్నాను.

"రావోయ్" అని లోపలికి లాక్కెళ్ళాడు.

అక్కడ తోటలో ఓ బల్ల ముందు కూచున్నాము. ఇంద్రలోకం మళ్ళీ తినడానికి ఏవేవో అర్థంగాని పేర్లతో ఆర్డర్లిచ్చాడు.

"చూడు-వాళ్ళిద్దరూ పవిత్రతలో వున్నారు. ఆ పని అపవిత్రం మనసుల్లో....

అని ప్రారంభించాడో లేదో, ఇంతలో దూరంగా ఓయూరోపియన్ అ కనబడితే ఆమెని కేకేసి ఆపి లేచి వెళ్ళిపోయినాడు నా వంక చూడకుండా. బల్ల వేమిటో తెచ్చాడు. కాని అవి తినవచ్చో లేదో వాటిల్లో ఏంవేసి తయారుచేశారో కూచున్నాను. దూరంగా ఓ బల్ల దగ్గిర ఆ అమ్మాయితో సరాగా లాడుతు కోసలరావు. ఇందుకా నన్ను తీసుకొచ్చింది ఇక్కడికి? ఏదో పాఠం చెబుతు మాటలనిపించి నవ్వుతున్నాడు ఆమెతో. కొంత సేపయిం తరువాత ఇద్దరూ నా దగ్గిరికి వొచ్చారు. ఆ ఫలహారాల్లో కొన్ని ఏరి, 'ఇది నువ్వు తినవొచ్చు, తిను తక్కినవి వాళ్ళు తినేశారు. వాళ్ళిద్దరూ విస్కీ తాగిం తరవాత, "పద అన్నాడు.

"దీ న్నెందుకు లాక్కొచ్చావు?"

"నీ పని మీదనే."

ఇదంతా నా పనే!

బిల్లు పాతిక రూపాయలు నా డబ్బేగావును-ఇచ్చాడు.

ముగ్గురం టెలిఫోను బూత్ దగ్గిరికి వెళ్ళాం. ఆ అమ్మాయికి ఏదో నం చెప్పాడు.

పన్నెండు కొడుతోంది అప్పటికి. ఎవరో పలికారు ఆ అమ్మాయికి.

"చాలా అవసరం. నువ్వోమాటు రావాలి వెంటనే" అని చెప్పి, టెలిఫో కింద పెట్టేసింది.

ఆ అమ్మాయికో పది రూపాయలు-నావి-యిచ్చాడు - వొచ్చేశాం.

హోటల్నుంచి బయటికి వెళ్ళి ఏదో డాన్సు చూసి ఇంటికి పో పడుకున్నాము.

మర్నాడు నా డబ్బు వొచ్చింది. ఆ డబ్బు అడిగి తీసుకున్నాడు కోసలరా ఎందుకిచ్చా వంటేఅంతే మరి!

"ఎక్కడికి?"

"ఎక్కడి కేమిటి? ఇంటికి. కలకత్తా బాగా మరిగావే! ఇంక నీకు ఇబ్బ పెళ్ళాం అక్కర్లేదా ఏమిటి?" అన్నాడు.



"వొచ్చిన పని?"

"నా కిక్కడ ఇంకేం పనిలేదు".

"మరి నా పని"

"వొచ్చిన పని అయింది కనుకనే పోతున్నాం."

"ఏమయింది?"

"ఏదో ప్రస్తుతం అయింది. తక్కినది ఇంకోసారి చూసుకోవచ్చు" అన్నాడు.

రైలెక్కాం మొత్తానికి.

రైల్లో మళ్ళీ ఫస్టుక్లాసులోనే. రెండువేల రూపాయలు క్షవరం.

ఇల్లు చేరుకున్నాము.

ఏం చెప్పను నా భార్యకి!

పదిహేను రోజులు పోయి, రెండు వేలు ఖర్చు చేసుకు వొచ్చాను. కాని అది వొత్తితే 'నువ్వేకదా పంపించింది!' అని బాగా తిడదామనుతున్నాను.

ఇంటికి వెళ్ళగానే మరునాడు పొద్దున్న-

"ఇదిగో, నీ రెండువేల రూపాయలూ! అని కోసలరావు రెండు కాయితాలు నావేపు గిరాటేశాడు. ఏమిటీ వేళాకోళం అని చూస్తే నిజంగా అవి రెండు వెయ్యిరూపాయల నోట్లు!

"ఇదేమిటి?"

"నీ అదృష్టం. మొదటి నీ వెయ్యీ పోయినాయి స్పెక్యులేషన్లో. రెండో వెయ్యికి ఓ లక్ష వొచ్చాయి" అని ఆ నోట్లకట్టని నా మొహాన ఆడించాడు.

నాకు ధైర్యంలేదు కాని, నా భార్య పట్టుకుంది అతన్ని. ఏం చేసుకొచ్చారని. ఓ వారంలో చెపుతా నన్నాడు. అన్నట్టే వారానికల్లా పేపర్లో ఫొటోలతో సహా, సుప్రసిద్ధ నర్తకి సవితాదేవికీ, సుప్రసిద్ధ చిత్రకారుడు గోవర్ధన్కి పెళ్ళి జరిగిందని పడ్డది.

ఏం మాట్లాడ్డం ?

"నేను ఎట్లా కొడితే, అట్లా పడాలి. చూశారా, నా ప్రజ్ఞ" అన్నాడు.

"వాళ్ళిద్దరికీ పెళ్ళి అయితే ఇంకేం ఆశవుంది" అంది నా భార్య.

"నేను సైకలాజికల్గా వెళ్ళాలి అన్నానా? అసలు ఒక ఆడదంటో అతనికి అవసరం కలిగిస్తే ఇంకో ఆడదానిమీద కలిగించవచ్చు. అదీ సంగతి. ఆ కళామందిరంలో వాళ్ళు బ్రహ్మచారిణులు. మీ అల్లుడిమీదే ఆమెకు మనసు. కాని శరీర సంపర్కం కళకి అపరాధం తెలిసిందా? ఇతనికి ఆమెకి హారతులు ఇవ్వడం, ఆమెని పువ్వులతో అలంకరించడం పని. అంతే! తక్కింది వీలులేదు. అట్లా ఒక స్త్రీ దేవతై, ఆ దేవతని స్త్రీగా ఉపయోగించడానికి వీలులేని మొగాడికి త్వరలో

పిచ్చెక్కుతుంది. కాగా ఎందుకు పనికిరాడు. ఆమె అన్నట్టు కళకే అంకిత మ

"మరి ఆమెమీద అంత ప్రేమకదా అతనికి?"

"ఎన్నాళ్లు? అట్లా ఆరాధించిననన్నాళ్ళే. యేం ఫరవాలేదు. అంతే మామూలు ఆడవాళ్ళతో సంసారం చెయ్యవొచ్చు. వాళ్ళకి పిల్లల్ని కనవొచ్చు చదువులకీ, మేధస్సులకీ, కళలకీ అంకితమైన వాళ్ళతో ఓ గంట పగలుగాని, స్థిరంగా సంసారం చెయ్యలేరు. చూడండి, ఆమెకెంత స్వతంత్ర గర్వమనుకు

"మరి ఈ పెళ్ళి ఎట్లా జరిగింది?"

"ఏం లేదు. ఆమె మందిరపు అజమాయిషీదారుతో స్నేహం చేసుకు గోవర్ధన్ నాకు తెలుసు. ఓ సాయంత్రం అతన్ని కలుసుకుని పని వుంది రమ్మన్నాను. వొచ్చాడు.

అవసరంగా ఈ పుస్తకంమీద రెవ్యూ కావాలి. నాకోసం తెల్లారే లోపల ముక్కలు రాసిపెట్టమని, కాయితం చుట్టిచలం మైదానం ఇచ్చి, అతన్ని ఇంటి వొదిలి వొచ్చాను. చదవడం ప్రారంభం చేయించి.

చలం పుస్తకాలంటే నాకు అసహ్యం. ఎందుకంటే కాయితాలు దుప్పట్లనుకుంటాడు అతను. కాని ఏ పనికిమాలిన వస్తువుకీ సమయాని ఉపయోగమంటో కలుగుతోవుంటుంది.నాకు తెలుసు. ఆ 'మైదానం' పోయినాడా ఎవడన్నా అర్ధరాత్రి, వాడికి ఇంక ఏ మన్మద క్రియలూ అవసరం మంచం చుట్టూ చీకట్లన్నీ స్త్రీ రూపాలు ధరిస్తాయి. అంటే మనవాణ్ని సరైన వుంచా నన్నమాట. తరవాత ఆ హోటలుకి వెంటనే రమ్మని సవితచేత చేయించానా? ఏ ఉపద్రవం వొచ్చిందోనని పరిగెత్తి వుంటాడు. సవిత గది తెరుచు కుంటుంది. ఆ హాలు బయట గొళ్ళెం వేయమని అజమాయిషీ ముందే చెప్పి వుంచాను, ఓ వంద రూపాయలు లంచం పెట్టి. ఇంక ఆ జరిగి వుంటుందో 'మైదానం'తో మత్తెక్కి తెగబడ్డ మీ అల్లుడి ముందు మాత్రం కళని అడ్డం పెట్టగలదా? యోచించుకోండి, పర్యవసానం పెళ్ళి!"

"మరి ఆమెకి ఇదివరకే పెళ్ళి జరిగిం దన్నారుగా?"

"కాని ఆ భర్త ఏమైనాడో తెలీదు. అందుకనే ఈ పెళ్ళి చెల్లనూ చెల్లినా ఆ సవితాదేవి ఏ భర్తనీ భరించలేదు. ఇంక నేను చెయ్యవలసింది దంటూ రైలెక్కాడు కోసలరావు.

రెండు నెలలలో గోవర్ధన్ మా యింటికి వొచ్చాడు. ఒంటరిగా అమ్మాయికి ఇప్పుడు ఇద్దరు మొగపిల్లలు.

ఈ సమయంలో కోసలరావే వుంటేనా!

★ ★ ★

# రసపుత్రులు

ఎన్ని వందల యేళ్ళ వయసు వుంటుదో ఆ చెట్లకి - చీకట్లతో మూలుగు తున్నాయి. వాటిని పెనవేసుకుని పాములవంటి తీగెలు, కొత్తవానలకి దట్టమైన చిక్కని ఆకుపచ్చ గడ్డి, మధ్య మధ్య నిలువెత్తున ఎఱ్ఱటి పుట్టలు, వాటిమీద దట్టమైన అడవి మొక్కలు. పైన చెట్ల గుబుర్లలోంచి చాలా ఎత్తునించి పిట్టల సాయంత్రపు కోలాహలం- ఎన్నడూ ఎరగని పరిమళాలు. అక్కడక్కడ కొంచెం కొంచెం దూరంలో శిథిలమైన రాతిగోడలూ, గోపురాలూ, నల్లని కోటలు కూడా. గోడల్లోంచి, కప్పుల్లోంచీ చెట్లూ గడ్డి మొలిచి, అడివిని ధ్వంసం చేసి మానవుడు కట్టుకున్న నివాసాల్ని మళ్ళీ అడివి కబళించి ఆక్రమించుకుంటోంది.

వెలుతురు తగ్గగానే గడ్డిమీద కొంచెంగా కోమలంగా చెదురుతూ పర్ణ వెన్నెల తటుకు చెప్పింది ఎక్కడో చంద్రోదయ మయిందని. భయపడి వెనక్కి తిరిగాను. నా కలలో, నా సౌందర్య తత్పరతలో తోవ తప్పాను. సరిగ్గా నా మొహం వీపువేపు తిప్పి నడవడం సాగించాను. కాని నమ్మకం లేదు నాకు, ఆ రాత్రికి వూరు చేరతానని.

రెండు గంటల సేపన్నా నడిచి వుంటాను. వెన్నెల వెలుతురు చీకట్లతో నన్ను భయపెట్టడానికే ఉపకరించింది. అప్పుడప్పుడు నిద్రకి సద్దుకునే పిట్టల కలకలం నా గుండెను దబదబ లాడించింది. ఎటు తిరిగినా పుట్టలే. నా కాళ్ళకింద విరిగి పెళ్ళుమనే ప్రతి కొమ్మకీ బెదిరి ఆగాను. అడవుల్లో రాత్రులు తిరిగారనీ, ఉండిపోయినారనీ, చాలాకాలం కులాసాగా గడిపారనీ, పర్ణశాలలు నిర్మించుకున్నారనీ, కథలు రాసిన మనుషులు నా జీవితంలో ఎన్నడన్నా నా కంటపడితేనా?

ఆ రాత్రికి ఇంతే! ధైర్యం చేసి ఎక్కడ కూచోగలను? పడుకోగలను? ఒక్కొక్క శిథిల మందిరమే దెయ్యంలాగు నాకంటికి దగ్గిరిగా వొస్తోంది. తిరిగిన చుట్టూనే మళ్ళీ తిరుగుతున్నాను గావును ఆ రాత్రి. కూచోవాలి కొంచెం మళ్ళీ ఇంకో పాత కోట. నల్లని గోడలమీద పడుతోంది పండు వెన్నెల. అంత భయంలోకూడా ఆఅందం నన్నాపింది. నాకు అడ్డంగా మెట్లు. పగిలిపోయిన దిక్కుమాలిన మెట్లు మూడు. వాటిల్లో బొక్కలు లేకుండా చూసుకునికూచున్నాను. అట్లా చెట్ల చివర్లమెరిసే వెన్నెల్ని చూస్తో నిద్రపోయినానేమో తెలీదు.

తెలివి వొచ్చేప్పటికి చెట్లమీదినించి పాకి నిండు చంద్రుడు కనబడుతు కోట నీడలు గోడల కిందికి జరిగాయి. దాహం. మెట్లెక్కితే పూర్వం ఏ గదిలో కొంచెం గచ్చు ఇంకా మిగిలి వుంది. దాని మీద నుంచుని నాలుగు దిక్కులు ఇందాకటి కోట గోడపైన ఉన్న పడిపోయిన మేడలో కిటికీలోంచి దీపం. ఆశ్చ కాని ఈ కోటలో దీపమేమిటి? దొంగలేమో ! లేక నరబలులిచ్చే కాళీ ఉపాసకు

కాని ఏం చెయ్యను? మెల్లిగా అటు నడిచాను. కోట చుట్టాను భయపడుతో, దోవ తడుముకుంటో. మెట్లు పూర్వం కోట లోపలి మెట్లులాగు కోట పడిపోయి ఇప్పుడు బైలుపడ్డాయి. ఆ మెట్లు మీదనించి డాబామీదికి చేరుకు అక్కడి గది తలుపు మూసి వుంది. తెరిచివున్న కిటికీ దగ్గరికి చేరుకున్నాను. ఆ కచుట్టూ పెద్ద తీగె అల్లుకుంది. నేను నుంచున్న డాబాకీ, ఆ కిటికీకి మధ్య కూలిపోయింది. ఆ తీగె సందుల్లోంచి గది లోపల కనిపిస్తోంది నాకు.

ఆ గది చుట్టూ దీపాలు. పూర్వకాలపు ప్రమిద దీపాలు. వెండి విగ్రహాల ఆ ప్రమిదలు. కాలిన సువాసనల పరిమళాలు వాటిల్లోంచి. ఏ అత్తర్లతో వెలిగించా కోట అంతా శిధిలమైన ఆ ఒక్క గదినీ ఎవరో జాగ్రత్తగా కాపాడుకువొచ్చారు. ప్రపంచ సంబంధం లేకుండా. ఎందుకంటే అట్లాంటి గదుల్ని కొంచెంగా సినిమా సెట్టింగ్ చూస్తాము. గోడలకి అనేక రకాల ఆయుధాలు, లోపలి తలుపులకి చిక్కని రంగు మొహ సరజాలు , పూర్వరకంకుర్చీలు, సింహాసనాల వంటివి. ఒక హంస రూపపు మంచంమీద, మొహమల్ తీదిళ్ళమీద తల పెట్టుకుని ఒక సుందరి. ఆమె యీ కాల ఈ నాగరికతకూ చెందిన మనిషి కాదు. అజంతా చిత్రం ప్రాణం పోసుకు పడుకున్న వుంది. ఏమి అందం ! ఆమె మెళ్ళో నక్షత్రాల లాగు వెలుగుతున్నాయి వజ్రాలు, రొమ్ముమీదనించి చిక్కులుగా జారుతో. ఆ దిళ్ళ మధ్యా ఆ మెత్తని పరుపు గుంటల్లో ఆమె అంతా కనపట్టంలేదు నాకు. కదలక, అట్లా ఏదో ఎదురు చూస్తో పడుకుంది స్తలాన పాతేసినట్టు నిలబడ్డాను. మంచానికి చుట్టూ పెద్ద పెద్ద పూలదండలు. విచ్చుకొంటున్న జాజి మొల్లపూల కుచ్చులు. ఒరే ! కలలోనన్నా తలుచుకోలేవురా అందాన్ని !

ఏమిటో జాగ్రత్తగా వింటోంది. మొహంలోకి అత్రుతా సంతోషం కదిలాయి కళ్ళు ఆర్చింది. లేకపోతే ప్రతిమ అనుకుందును. నేనూ విన్నాను, దగ్గిరికి వొస్తున్న గుర్ర డెక్కల ధ్వని. మెల్లగా దిండుమీది వేళ్ళను కదిలించి, సన్నని చిక్కని వూదారంగు పట్టుశాలువని ఒంటిమీదికి లాక్కుంటో లేచింది. ఎంత పొడుగు అనుకున్నావు ఆమె మెరిసి పోతోంది ఒళ్ళు. ఆ శాలువలోంచి ఆ దీపాలముందు. నిదానంగా కదిలింది కిటికీ దగ్గిరికి. కిటికీలోంచి వెన్నెట్లోకి తళ తళ మెరిసే గాజులున్న చేతిని జాపింది. వెన్నెల ఆమె చెంపలమీద మెరిసింది. గుర్రపు చప్పుడు దగ్గిరయింది. కిటికీ కింద ఆగుతోంది. చెయ్యి తీసేసుకుంది లోపలికి. కిటికీ దూరంగా జరిగింది. ఆ నిమిషంలో భూమిమీద సు



కిటికీలోకి చూశాడు ఒక రాజకుమారుడు. తలుచుకో ఆ యెత్తు మేడ మీదికి. ఎట్లా తెలుసునంటావా రాజకుమారుడని, అతన్ని చూడాల్సింది నువ్వు., ఇంక నన్ను ప్రశ్నించకు. ఏం జరిగిందో, వాళ్ళిద్దరు ఒకరిలో ఒకరు యామై నారో ! ఒక్క మాట లేదు. వాళ్ళ చూపులూ, దిగులైన చిరునవ్వులూ, చేతి వేళ్ళూ చాలు, కావ్యాలు చెప్పడానికి. ఒక్క నిమిషంలో ఒకటై నిలిచేరు. ఎంత సేపంటావు? ఓ గంట అనుకో. అక్కడే ఆ స్తలాన్ని శిలతో చేసిన పెనవేసుకున్న ప్రతిమల్లాగు. చలం వర్ణిస్తాడే- ఎక్కడా వందమైళ్ళ దూరానన్నా అందుకోదనుకో నేను చూసిన ఆ మొహాన్ని ! నా కళ్ళు చెదిరిపోయినాయి. చీకట్లు కమ్మాయి. అతని వేషమూ, అతని బట్టలు ఏమీ చెప్పలేను. మళ్ళీ కళ్ళు తెరిచేటప్పటికి, నాకు జ్ఞానం కలిగేటప్పటికి ఇద్దరూ పక్కమీద వున్నారు. పువ్వుని చేత్తో తాకుతున్నట్టు తాకుతున్నాడు ఆమె ఒంటిని. ఆమె పొడుగైన వంకర రెప్పల్ని మూసేసుకుని కదలక పడుకుంది. నీడల్లో కూడా ఆమె వక్షంలోని దీర్ఘ విశ్వాసం మిరుస్తోంది ఆ వజ్రాలవల్ల.

తరవాత విల్లువంటిఅతని వీపు తప్ప ఏమీ కనిపించలేదు. చాలా నాజూకైన అతని కదలిక - సీతాకోక చిలక కనకాంబరం మీద వాలి తేనె తాగడం చూశావా ? ఒక గంట అట్లానే నిలబడి వున్నాను, స్వర్గదృశ్యం చూస్తున్నట్టు.

మెల్లిగా వాళ్ళ తలల వెనక తలుపు మొహమల్ తెర గాలికి కదిలినట్టు కదిలింది. తెర వొత్తిగించి జేగురించిన మొహంతో ఒక యువకుడు నుంచున్నాడు. కెవ్వున అరిచాననుకో. కాని బైటికి అరిచావో లేదో ఈ నాటికీ తెలీదు నాకు. కాని వాళ్లెవరూ వినలేదో నా అరుపు వినే స్తితిలో లేరో !

ఒక్క నిమిషం అట్లా చూస్తో నుంచున్నాడు. మొహాన ఎరుపు తగ్గింది. పెదవుల కొసల్లో కొంచెం అతని tension టెన్షన్ తెలిసిందేమో నాకు. నడకలో చేతి కదిలికలోనేమో ! పిల్లి లాగు వొచ్చి గోడనున్న కత్తి తీశాడు. అప్పుడు స్పష్టమయింది నాకు, అతను భర్త అనీ, ఇతను ప్రియుడనీ.

కత్తి ఒర నుంచి నిశ్శబ్దంగా తీసి, వాళ్ళ పక్కదగ్గిరికి వొచ్చి కత్తినెత్తాడు-అతుక్కున్న ఇద్దరి మీదికీ. సరిగా రెండు కంఠాల మీదికీ, మళ్ళీ అరిచాను. నిజంగానే అరిచినట్లున్నాను. కాని వాళ్ళకి వినపళ్లేదు - యెందుకు వినపళ్ళేదో!

ఆగాడు, ఓ నిమిషం వాళ్ళవంక నిప్పులు కురుస్తో చూస్తో. ఏం చప్పుడు చేశాడో లేక మాట్లాడాడో నాకు వినపళ్ళేదు. అతని పెదవులు కదిలాయి అనిపించింది. అది విని ఆమె నించి కళ్ళు యెత్తడం గాని మనసు మళ్ళించడంగాని, సహించినట్టు మెల్లిగా, బద్ధకంగా కళ్లుమాత్రం యెత్తాడు, ఆ గొప్ప రసికుడు. ఆమె కళ్ళన్నా విప్పలేదు. నమ్ముతావా ? కదలలేదు. వేళ్ళన్నా కదిలించలేదు. ఆ రొమ్ము మీద రత్నాలు ఇంకొంచం మెరిశాయేమో!

ఆ ప్రియుడు భర్త మొహాన్నీ, తళుకుమంటున్న కత్తినీ తీరుబడిగా నిదానంగా చూసి, పెదవులు తృణీకారంగా వెనక్కితిప్పి, తన దృష్టిని యెప్పటివలె ఆమె కళ్ళ మీదికి

తిప్పాడు. నిశ్చలంగా రెండు తాచు పాముల్లాగు అట్లానే పడుకున్నారు ఆ ప్రియు "ఇట్లాంటి స్థితిలో చంపుతావా, ఇంత నీచుడివా, ఇంత నీచుడివా ?" అన్నట్టనిపి ఆ విలాసుడి చూపు.

ఏం మనుషులో వాళ్ళు ! దేవతలో ! ఆ భర్త ఎత్తిన కత్తిని కిందికి దించి, వీపు తిప్పి నుంచున్నాడు. శిలా స్తంభం వలె.

ఎంతకాలం ? నన్నడక్కు. క్రమంగా ప్రియుడి వెన్నెముక లోంచి, పిరుదుల వరకు చలనం. ఆమె వక్షంలోంచి నిట్టూర్పు లాగు వజ్రాల మెరుపు లో గట్టిగా ఒకటే ఐనట్లు పెనగడం కొంచెంగా.... ఆమె కళ్ళు తెరిచింది, గొప్ప చిరు తన కృతజ్ఞతని అతని కళ్ళలో మెరిపించింది. ఆమె చెక్కిలి పట్టుకుని కళ్ళల్లోకి చూసి అతను లేచి భర్తని బుజంమీద తాకాడు. వెనక్కి తిరిగినా చూడకుండా ఇంకో కత్తిని గోడనించి లాగి తన విరోధికి ఇచ్చాడు చాలా గౌరవంగా. ఎదు కొలికిలోంచి వాళ్ళని చూస్తో కదలకుండా అట్లానే వెల్లకితలా పడుకుని వుంది. ప్రియుడు కత్తిని యెత్తే లోపల భర్త వెనక్కి తిరగకుండానే కత్తితో ఒక్క వలయం ఆమె తల తెగి కిందికి దొర్లింది. తరవాత ఒక్క అరనిమిషం కత్తుల మెరుపులో వాళ్ కనపళ్ళేదు. కళ్ళు తెరిచే లోపల ఇద్దరూ పడిపోయినారు రక్తపు మడుగులో. పాటుకుగాను ఇల్లు మేలుకుంది. నా అడుగుల కిందనించి, నెత్తిపైనించీ- గదులనించి పరుగెత్తుతూన్న అడుగుల చప్పుడు. ఒళ్ళు తెలియక పరుగెత్తాను భయ ఎంత దూరమో ! కాళ్ళు వొణికాయి. కళ్ళు తిరిగాయి. కూలబడ్డాను.

ఎవరో నా బుజం పట్టుకు వూయిస్తున్నారు. కళ్ళు తెరిచేటప్పటికి బాగా పొద్దెక్కి నేను రాత్రి మొదట కూచున్న మెట్లకింద పడుకుని వున్నాను. నా పక్కన ఒక ముసలి సా తెల్లటి బట్టలూ తెల్లని గడ్డమూ అతనూ. చుట్టూ చూశాను. అంతా జ్ఞాపకం వొచ్చింది.

"ఎవరు ?" అంటున్నాడు అతను.

"మీ రెవ" రన్నాను.

"ఇక్కడ కావలి; ఈ పాతకోటకి."

"ఏమయింది తరవాత ?"

తెల్లబోయి చూశాడు.

"మీ ప్రభువు...."

ఇంకా అర్థం కాలేదు అతనికి.

"నిన్న రాత్రి లేరా ఇక్కడ ?" అన్నాను.

"లేను."

"ఏమైనారు ?"

"అదంతా ఎందుకు ? మీ రెవరు ?"



నాకు అనుమానం తడుతోంది. చుట్టూ అడివి. కోటంతా పడిపోయి వుంది. త్త గోడలు. నిన్నటి రాత్రి గది ఎక్కడ వుందో పోల్చుకోలేకుండా వున్నాను. గోల చేస్తున్న ట్టలు తప్ప, మే మిద్దరమే ప్రాణులం.

"ఎవరి నౌకరు నువ్వు ?" అని అడిగాను.

"బ్రిటిష్ గవర్నమెంటు."

"ఎందుకు ఇక్కడ?"

"ఈ స్థలంలో పూర్వం గొప్ప కోట వుండేది రాజపుత్రులకి. ఎన్ని వందల యేళ్ళ ందటో! దీంటో రహస్యంగా అపారమైన ధనం వుందంటారు; అందుకని."

"ఎవరూ తవ్వలేదా ?"

"పూర్వం మొదట ఇంగ్లీషు సైన్యం వొచ్చినప్పుడు ఈ వేపు ఒక మిలిటరీ అధికారి ప్రయత్నించాడుట. రక్తం కక్కుకు చచ్చిపోయినాడు. తరువాత ఇద్దరు కలెక్టర్లు ఇంగ్లీషు వాళ్ళచేత తవ్వించాలని చూశారు, మన కూలీలు ఒప్పుకోకపోతే. ఆ తవ్వేవాళ్లూ కలెక్టరూ అందరూ చచ్చారు. మా వంశంవాళ్ళు తాత ముత్తాలనించీ ఈ కోటకే నౌకరీ."

"మరి నిన్న రాత్రి...."

"ఇక్కడ వున్నారా యేమిటి ?"

తల వూయించాను. జాలిగా నవ్వాడు అతను.

"చూశారా ?"

తల వూయించాను.

"చూసి బతికి వున్నారా ? అదృష్టవంతులు!"

"చూసినందుకా అదృష్టం, ఇంకా బతికి వున్నందుకా ?"

"రండి చెప్తాను."

అక్కడే ఓ పాత కొట్టు శుభ్రం చేసుకుని అతని కాపరం. లోపల అతని సంసారం వున్నట్టుంది. గోధుమ రొట్టెలు, టీ ఇచ్చి ఈ కథ చెప్పాడు ;

"మా ముత్తాల తాతలనాటి కాలం అది. ఈ రాజ్యానికి కొత్త కోడలు వొచ్చింది, చాలా అయిష్టంగా. ఈ రాజపుత్రుడూ, వాళ్ళ వంశమూ, చాలా గొప్ప శౌర్యవంతులు. మానానికి ప్రాణాల్ని అవలీలగా ఇచ్చేవారు. చాలా కొద్ది కాలంలో, సంవత్సరానికో రాత్రి-కార్తీక పౌర్ణమి రాత్రి-ఎవరో గుర్రంమీద వొచ్చి, ఆ గది కిటికీలోంచి లోపలికి దూకి కొత్త రాణితో రాత్రి గడిపి తెల్లవార కుండా వెళ్ళేవాడు అని పుకారు. అతన్ని అడ్డంపెట్టగల సాహసంగాని, రాణికి కోపం తెప్పించే ధైర్యం గాని యెవరికీ లేవు.

పెళ్ళి కాకముందే ఆమెకి ఒక రాజకుమారుడిమీద ప్రేమ అ
బలవంతంవల్ల మా రాజుని వివాహ మాడిందనీ, ప్రతి కార్తీక పౌర్ణమినాడు కలుసు
అతనికి వాగ్దాన మిచ్చిందనీ వినికిడి. అంతకన్న వింత-మా రాజుకి తెలుసు
ప్రతి కార్తీక పౌర్ణమికీ ఎవరో వొస్తున్నారని ? ఆ రాత్రి ఏమౌతున్నాడు ? తెలి
ఒప్పుకున్నాడా? పదేళ్ళు గడిచింది, పదేళ్ళు రాజుకి తెలియకుండా జరుగుతుం

ఓ ఉదయం రాజు ఈ అడవిలో స్వారి వెడుతుండగా ఒకదు దూరంని
పౌర్ణమి అని అరిచాడు. అందరూ కూడా విన్నారు. రాజు అవమానంచేసి వెళ్ళకొ
అనుమానం. రాజుకి చాలా ఆగ్రహం. కోపంలో ఉచితానుచితాలు ఎరగనంత
'కార్తీక పౌర్ణమి' అనే మాట అతని మనసులో మొదలుతోనే వుంది.

ఆ సంవత్సరం కార్తీక పౌర్ణమి నాడు అతనికి జ్ఞాపకముంది ఆ మాట. ఆ రాత్రి తా
నిద్రపోవడమూ రాణీగారి గదికి వెళ్ళకపోవడమూ తెలుసుకున్నాడు. ఆలోచించగా, ఏ కార్తీక
తానా చంద్రుణ్ణి చూసిన జ్ఞాపకమే లేదు. ప్రతి కార్తీక పౌర్ణమికీ తానెందుకట్లా నిద్రపోవాలి?
ఆగాల్సి వొచ్చింది ఆ మహారాజు. సంవత్సరమంటే మనకి మల్లే అనుకోకండి. ఒక కసిగాని, అ
వాళ్ళ మనసుల్లో ఎవరికీ తెలీకుండా నిద్రపోతుంది సులభంగా. ఆ కార్తీక పౌర్ణమినాడు, తన
పానీయమూ జాగ్రత్తగా గమనించాడు. కాని నిద్రపోయినాడు, రాత్రంతా లేవకుండా. ఎందుకు కలిగిం
అనుమానం మరి. కాని మళ్ళీ సంవత్సరం ఆగాడు. మనకుమల్లే కాదు. అనుమానం కలిగిందని తెలియ
తన అనుమానం అబద్ధం తావడమూ జరిగాయా బతకలేరు ఆ మనుషులు. అట్లాంటి అను
తెలియజేశాడా భర్త. అక్కడితో ఆ రాణి తలుపులు బందు, రాజుగారి ప్రవేశానికి. వాళ్ల రసపుత్రు

ఆ కార్తీక పౌర్ణమి సాయంత్రం జబ్బుగా వున్నదనీ, ఆకలి లేదని తన గదిలో వుండి
ఆయన. కొంచెం షరబత్తన్నా తాగమని కబురంపింది రాణి. వొద్దన్నాడు. తను స్వయంగా తీ
రాణినించి కబురు. అనుమానం స్థిరమయింది. రాణి తీసుకువొచ్చి బల్ల మీద పెట్టి, ఆయ
కొంచెం కూచుని వెళ్ళిపోయింది. రాజుగారకు ఆ షరబత్ పారపోశారు. రాణిగారి దా
పాత్రని తీసుకెళ్లి రాణిగారికి చూపింది. రాజు నిద్రపోలేదు. కదలకుండా పడుకున్నారు
ప్రకారం. రాత్రి ఎప్పటివలె గుర్రంమీద ప్రియుడు. తరవాత ఏం జరిగిందో తెలీదు. రా
గంటలకి రాణి గదిలో పెద్ద శబ్దాలై పరుగెత్తారు కోటలోని మనుషులు. రాణి తల, కిందపడి
రాజు, ఆ కొత్త యువకుడూ, ఇద్దరూ చచ్చిపడి వున్నారు."

"నిన్న కార్తీకపౌర్ణమా?" అన్నాను.

"అవును. కార్తీక పౌర్ణమి రాత్రి ఎవరూ పొరబాటునైనా ఇటు రారు; నేనూ వుం

"ఎందుకు ?"

"దెయ్యాలు మేలుకుంటాయి."

★ ★ ★